శ్రీరస్తు

# బాలవ్యాకరణము

( శ్రీ పరవస్తు చిన్నయసూరి ప్రణీతము )

ప్రచురణకర్తలు :

రాయలు అండ్ కో.,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, కడప

బ్రాంచి : 32, నారాయణముదలి వీధి, మద్రాసు - 1

 1959 [వెల : రూ. 1-25

# పరిచయ వాక్యములు

గ్రంథావతరణము :—“ దేశభాషలందు తెలుఁగు లెస్స ” యనిపించుకొన్న మన యాంధ్రభాషకు వ్యాకరణములను నన్నయభట్టు మొదలుకొని యొండు రెండవి దిట్టలో వ్రాసిరి. కాని, అప్పటికప్పటి కవి తగినట్లుగా నుండినను బందొమ్మిదవ శతాబ్దినాఁటి కసమగ్రములుగనే కనఁబడినవి. ఈ సంగతిఁ దెలిసికొని, ప్రాచీన వ్యాకరణ మర్యాదల నెంతమాత్రము వదలిపెట్టక సరిక్రొత్త వ్యాకరణ మొకటి వ్రాయవలెనని సంకల్పించి శ్రీమాన్ పరవస్తు చిన్నయసూరిగా రొక తెలుఁగు వ్యాకరణమును సంస్కృతములో సూత్రప్రాయముగ రచించిరి.

సంస్కృతజ్ఞాన మంతగా లేనివారికిని, బాలురకును అది యంతగా బోధపడదని కొన్నాళ్ళ కాయనకే తోఁచినది. పాఠప్రవచనములలో అది యనుభవమునకుఁగూడ వచ్చినది. వెంటనే వారు దానినే బాల వ్యాకరణమను పేరునఁ దెలుఁగు సూత్రములుగా వ్రాసి వెలయించిరి.

సకల కవిపండిత సమ్మతము :—వారి తర్వాత వెలసిన వ్యాకరణ కర్తల కందఱకు నీ బాలవ్యాకరణమే యాధారమైనది. పరమాదరణీయమైన పాణినీయ సూత్ర మర్యాదను దద్రూపముగాఁ బాటించి సూరిగారు దీని కొక విశిష్టతను, ప్రామాణికతను జేకూర్చినారు.

సూరిగారి యీ భాషాసేవకుఁ దెలుఁగు లోక మాయనకు సదా, సర్వథా కృతజ్ఞతఁ జూపవలయుననుట యతిశయోక్తి కానేరదు. వీరితో సమానముగ వ్యాకరణము వ్రాయవలెననుకొని యనేకులు వ్రాయఁజూతురే కాని యీ మహాపండితునితో సమానముగ సూత్రములను బిగింపలేరు. ఇందలి యర్థగంభీరతను, శాస్త్రమర్యాదలను ననుసరింప నెవరికిని దగనుగాదని సరాఘాటముగఁ జెప్పవచ్చును. ఈ వ్యాకరణము తర్వాత వేనవేల వ్యాకరణములు పుట్టగొడుగులవలెఁ బుట్టనేమో పుట్టినవిగాని ప్రశస్తికి మాత్రము రాలేకపోయినవి; రాఁజాల

వనియుఁ జెప్పవచ్చును. ఎవరు వ్యాకరణము వ్రాయఁదలఁచుకొనినను నీ మహామహుని మార్గము ననుసరింపక క్రొత్తత్రోవ త్రొక్కవలయు నను కొందురే కాని మరల నీతని యడుగు జాడలలోనే పడుదురు.

నీతిచంద్రికనిగ్గు :—వీరి యీ వ్యాకరణమునకు వీరి నీతి చంద్రిక యొక చక్కని యుదాహృతి. అది ప్రపంచ ప్రఖ్యాతి గడించిన పంచతంత్రమునకు ఏకదేశానువాదము. పంచతంత్రములోని మిత్రలాభ, మిత్రభేద ప్రకరణముల కథలను స్వతంత్ర ధోరణిలో సర్వాంగసుందరముగా, బహు రసవంతముగా వీరందులోఁ గూర్చినారు. భాషకు, నీతికిఁ గూడ అది సర్వజనాదరణీయమైయున్నది. అది చదివిన యెడల "బాలుర కోలిఁ బొదలును భాషాజ్ఞానము; కుదురుఁ గొదలేక నీతి కుశలత్వంబుఁ." సందేహమే లేదు.

చిన్నయసూరిగారు క్రీ. శ. 1806 లో జన్మించిరి. చెంగల్పట్టు జిల్లా శ్రీపెరుంబుదూరు వీరి జన్మస్థానము. వీరు శ్రీ సాత్తాద (సాతాని) వైష్ణవకులమునకుఁ జెందినవారు. వీరి తండ్రి పరవస్తు వేంకటరంగ రామానుజాచార్యులు (వ్యవహార నామము వేంకటరంగయ్య); తల్లి శ్రీమతి శ్రీనివాసాంబ.

వేంకటరంగయ్యగారు మంత్రములను, మంత్రార్థములను నేర్చి, నేర్పిన ఘనుఁడు; సంస్కృత ప్రాకృత ద్రావిడాంధ్రములలోఁ బారంగతుఁడైన పండితుఁడు. చిరకాలము శ్రీపెరుంబుదూరు విద్యాశాలలో ఆచార్యకము నిర్వహించి పలువురను విద్యావంతులను జేసిన పరమాచార్యుఁడు. ఆ దంపతులకు చాలకాలము మగసంతు లేదు. కానక కానక కన్న కుమారుఁడు చిన్నయ్య.

బాల్యము : చదువు :—చిన్నయ్య చిరకాలము చదువు సంధ్యలు లేక, కేవలము 'పండితపుత్రుఁ'డై అల్లరి చిల్లరిగా తిరుగుచుండెను. పది పదునేనేండ్ల ప్రాయమునఁ గాబోలు, నలుగురిమాటలు పడలేక ఓనమాలతోఁ జదువు మొదలు పెట్టెను. పట్టుదల పట్టి త్వరలోనే పాండిత్యము గడించెను. తర్కాలంకార మీమాంసా శాస్త్రములను క్షుణ్ణముగా నభ్యసించెను. వేదములు, వేదార్థములు లెస్సగా

నేర్చెను. హయగ్రీవ మంత్రమును ఉపాసించి దాని మహిమచే సర్వతోముఖ పాండిత్యము సంపాదించి, సరస్వతీమూర్తియై రాణించెను.

శాస్త్రవ్యాసంగములో చిన్నయ్యకు నెచ్చెలిసహపాఠి వేదము వెంకటరమణశాస్త్రిగారు. ఆయన వినుతికెక్కిన శ్రీ వేదము తాతయ్యకు (శ్రీ వేంకటరాయశాస్త్రి) తాత పాదులు. నాఁటికి నేఁటికి ఏకైక తెలుఁగు నిఘంటువుగా రాణించుచున్న శబ్దరత్నాకరమును సంధానించిన శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు మన చిన్నయ్యకు ఆప్త శిష్యుఁడు; దేవరాజసుధియని పేరుగాంచిన శ్రీ తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్య ప్రశిష్యుఁడు.

దొరలకు చదువు:—కొన్నాళ్లకు ఆ కుటుంబము మద్రాసుకు మారెను. వెంకట రంగయ్యగారు దొరల ప్రాపకమున ప్రధానాంధ్రాధ్యాపకపదవిని సంపాదించిరి. బ్రౌను మొదలైన దొరలకును, చాలమంది పాదిరీలకును తెలుఁగు సంస్కృతములు నేర్పి వారిని తీర్చి దిద్దిరి. వారి యనంతరము చిన్నయ్య ఆ స్థానము వహించెను. పచ్చయప్ప కళాశాలలోను, రాజధాని కళాశాలలోను చిరకాలము ఆంధ్రాధ్యాపకులుగా నుండి యఖండ భాషాసేవ గావించెను. వీరి పాండిత్యమునకు మెచ్చుకొని మద్రాసు విశ్వవిద్యాలయ కార్యదర్శిగానుండిన ఆర్బత్‌నాట్ దొర ఈయనకు 'సూరి' బిరుదమును ప్రసాదించి, ఆదేశనిగా సీమనుండి చెక్కించి తెప్పించిన బంగారు కడియమును తొడిగించి గౌరవించెను.

చిన్నయ్యకు నన్నయ్య చెప్పినది వేదము. ఆయన త్రొక్కిన బాటనే ఈయనయు త్రొక్కెను. ఆంధ్ర వాఙ్మయమునందు పద్యగద్యములలో నన్నయ్య చిన్నయ్యలు ఆద్యస్థానము పుంజుకొనిరి. పద్యకవితకు బాట వేసినవాఁడు నన్నయ్యకాఁగా, చిన్నయ్య గద్యకవితకు దారి చూపినాఁడు. వారు ఆరంభించి అర్ధాంతరములో వదలిపెట్టిన కార్యమును కొనసాగించి తిక్కన్నయును, కందుకూరి వీరేశలింగము పంతులుగారును కవిబ్రహ్మ, గద్యకవిబ్రహ్మ బిరుదములను గాంచిరి.

ఇతర రచనలు:— ఈ నీతిచంద్రిక, బాలవ్యాకరణములే కాక చిన్నయసూరి నీతి సంగ్రహము, అక్షరగుచ్ఛము, ఆంధ్రధాతుమాల,

ఆంధ్రలక్షణము, శబ్దలక్షణ సంగ్రహము మొదలైన అనేక గ్రంథములను రచించెను. వీనిలోఁ గొన్ని ముద్రితములైనవి; కొన్ని అముద్రితములుగానే యుండి పోయినవి. ఒక బృహన్నిఘంటువును (తెలుఁగు - తెలుఁగు) గూడ ఈయన రచించినట్లు ప్రతీతి. అది తెరమరుగుననే యుండి పోవుట మన దురదృష్టము.

సకల శాస్త్ర నిష్ణాతుఁడు, సాహిత్య చక్రవర్తి యాయుష్య శమదమాది గుణవిరాజితుఁడై, నిగర్వ చూడామణియై పండితుఁడుగా, కవిగా, ఉద్యోగిగా ఖ్యాతికెక్కిన చిన్నయసూరి కేవలము వ్యాకరణ కర్తగానే కాక తెలుఁగులో గద్యకవితకు శ్రీకారముఁజుట్టి ఘంటాపథముఁ గల్పించిన గద్యబ్రహ్మగాఁగూడ ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో సాటిలేని స్థానము సంపాదించుకొనెను. చివరకు, తన 55-వ యేఁట, 1862 లో, రాచపుండుకు బలియై కాలధర్మము చెందెను.

ఈ మహనీయుని చరిత్ర తెలుఁగు నేర్చువారికిని, నేర్పువారికిని గూడఁ జిరస్మరణీయము.

జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ.

# పీఠిక

ఆంధ్రభాషకు లక్షణగ్రంథములు ప్రాచీనులు చేసినవి పెక్కులు కానంబడుచున్నవి. కొన్నిలక్షణగ్రంథముల పేళ్లు మాత్ర మిప్పుడు వినంబడుచున్నవి. కానంబడు గ్రంథము లందు సంస్కృతసమములకు లక్షణములు బహుతరముగా రచింపంబడినవిగాని తక్కినభాషకు విశేషాకారముగా రచింపంబడినవి కావు. కాంబట్టి యీ లక్షణగ్రంథములు చదువువారికి నిస్సందేహముగా వచనరచన సేయు కౌశలము చిరకాలము బహులక్ష్యములందుం బరిశ్రమము చేయక రానేరదు. భాషా సమాప్తికి లక్షణగ్రంథము కుదిరినపక్షమం దంత శ్రమపడం బని లేదు. తుదకు లక్ష్యపరిజ్ఞానము చాలని లక్షణపరిజ్ఞాన మంతి శ్లాఘ్యము కాదుగాని తుదముట్ట సర్వలక్షణపరిజ్ఞానము లక్ష్యపరిజ్ఞానము చేతనే సాధించుట మిక్కిలి దుష్కరము. కాంబట్టి యిట్టికొఱంత వారింపం బూని పెక్కు లక్ష్యములు పలుమాఱు సావధానముగాం బరిశీలించి రచనాప్రణాళిక నిర్ణయించుకొని, నా నేర్పుకొలందిని సంస్కృతభాషతో సూత్రగ్రంథ మొకటి కావించితిని. ఆ గ్రంథము బాలురకు సుసాధము గాకుండుట వలన దానియందలి సూత్రములు కొన్ని తెనింగించి ప్రకృత గ్రంథరూపముగా రచించినాండ.

క. మానితపునడక పేరిమి
మానసమున కింపుం బెంప మను నంచలకుం
బోనిడి నీరసనీరము
జానుగ క్షీరంబు గొనుట సహజముకాదే?

గ్రంథకర్త.

# శ్రీహయగ్రీవాయ నమః.



క. శ్రీలతకుం బ్రాఁకయి వృష
శైలంబున వెలసి తనదు చాయ కెలయు ధ
న్యాళి దగ మాన్చి కోర్కులు
చాలంగా నొసఁగు కల్పసాలముఁ గొలుతున్.

క. అనయము లలితోక్తులతో
నొనరుపడం గూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్.

ఆ. దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణము గానఁ బూర్వకవుల లక్ష్య
ములను లాఁతిలక్ష్యములఁ గాంచి తక్కుల
క్షణ మెఱింగికొనుఁడు చతురమతులు.



శ్రీరస్తు.

# బాలవ్యాకరణము

## సంజ్ఞాపరిచ్ఛేదము

---

### సంస్కృతమునకు [1]వర్ణము లేఁబది ౧.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః – క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

ఇందకారాదు లచ్చులు – కకారాదులు హల్లులు. [2]అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది.

### ప్రాకృతమునకు వర్ణములు నలువది ౨.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః. క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ.

కొందఱి మతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు. కొందఱి మతంబున వక్రతమంబులుం గలవు. ఎ ఏ ఒ ఓ లు వక్రములని, ఐ ఔ లు వక్రతమములని ప్రాచీనులు వ్యవహరింతురు.

---

1. వర్ణములు – అక్షరములు.
2. అజ్ఝల్విభాగము – అచ్+హల్+విభాగము.

తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు ౩.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అఁ. క గ చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృతసమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపఁబడు ౪.

ఋతువు—పితౄణము—క్లృప్తము—ౡకారము—దుఃఖము—ఖడ్గము—ఘటము—ఛత్రము—ఝషము—కంఠము—ఢక్క—రథము—ధరణి—ఫణము—భయము—పఙ్క్తి—ఆజ్ఞ—శరము—షండము.

కచటతపలు పరుషంబులని గడదబలు సరళంబులని చెప్పంబడు ౫.

[1] ఇతరములగు హల్లులు స్థిరములు ౬.

ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ.

దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు ౭.

తాలవ్యచకారంబు దంత్యచకారంబునకును, తాలవ్యజకారంబు దంత్యజకారంబునకును గ్రాహకములని తాత్పర్యము.

ఇ ఈ ఎ ఏ లం గూడిన చజలు తాలవ్యంబులు ౮.

చిలుక—చీమ—చెలి—చేను, జిల—జీడి—జెట్టి—జేజె.

1. పరుషసరళములుగాక మిగిలినవి.

అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చజలు దంత్యంబులు ౯.

చెలి-చాప-చుక్క-చూపు-చొక్కు-చోటు-చౌక, జముడు-జాతర-జున్ను-జూలు-జొన్న-జోలి-జౌకు.

ఐదంతములయిన చజలు సమేతరశబ్దములందు లేవు.

సంస్కృతసమంబులం దికారాంతము లయిన శబ్దముల యుపధా చజలు బహువచనంబు పరంబగునపుడు దంత్యము లగును ౧౦.

అర్చి-అర్చులు ; రోచి-రోచులు ; వీచి-వీచులు ; రాజి-రాజులు ; వాజి-వాజులు.

ఇవి దప్ప సంస్కృతసమంబులందు దంత్యచజలు లేవని తాత్పర్యము. ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందరి వర్ణము. మఱియును ర్యాజశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి. ఇతరములయిన చజల కుదాహరణములు : చంద్రుఁడు – చామరము – చంద్రిక – చూర్ణము – చోరుఁడు – చౌర్యము, జయము–జాతి–జుగుప్స–జూటము ఇత్యాదులు.

నకారంబు ద్రుతంబు ౧౧.

ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు ౧౨.

ప్రథమా కయి షష్ఠ్యొక్కేతరములయిన విభక్తులు – ఉత్తమపురుషైకవచనంబులు – భూతతద్ధర్మార్థక ప్రథమ పురుషైకవచనంబులు – ఆశీరాద్యర్థకంబులయిన మొదుత వర్ణకంబులు–శత్రుతుమానంతర్య చేదాద్యర్థకంబులు –

నేను తాను పదంబులు - వలెప్రభృతులును ద్రుతప్రకృతికం బులు. నన్నున్ - నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్ - మాలోపలన్ - మాయందున్ - వత్తున్ - వచ్చెదన్ - వచ్చెన్ - వచ్చున్ - వచ్చెదున్ - ప్రసన్నులయ్యెడున్ - కావుతన్ - కొట్టుచున్ - కొట్టన్ - కొట్టంగన్ - కొట్టుడున్ - కొట్టెనన్ - వలెన్ - ఎంతయున్ - పోలెన్ - అయ్యున్ ఇత్యాదు లూహ్యంబులు.

## ద్రుతప్రకృతులు గాని శబ్దంబులు కళలనంబడు ౧౩.

రాముఁడు - రాములు - హయము - విష్ణువు - గోడ - నేఁడు - అయ్యా - అమ్మా - రామునికయి - జ్ఞానముఁబట్టి - నాయొక్క - వచ్చిరి - వచ్చితిరి - వచ్చితిమి - రాఁడు - రారు - రాను - రావు - రాము - కొట్టక - తిట్టక - ఎత్తిలి - ఒత్తిలి - ఊరక - మిన్నక - బళి - అక్కటా - ఏల ఇత్యాదు లూహించునది.

## హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును ౧౪.

అడఁకువ - అడంకువ; అరఁటి - అరంటి; ఎఱుఁగుట - ఎఱుంగుట; బలఁగము - బలంగము; మగఁటిమి - మగంటిమి.

## దీర్ఘముమీఁద [1] సాధ్యపూర్ణము లేదు ౧౫.

వాఁడు - వీఁడు - రాఁడు - లేఁడు - కాఁబోలు - కాఁబట్టి - కోఁగులు - రేఁగులు.

1. వ్యాకరణ శాస్త్రముచే సాధింపఁదగినది.

సంస్కృతసమేతరములయిన తెలుఁగుశబ్దంబులయందుఁ బరుషసరళంబులకు ముందే [1]బిందువుకానంబడుచున్నది.

వంకర - కలఁకువ-మంచె - త్రాఁచె - దంట-దాఁటు-కొంత - కోఁత ఇత్యాదు లూహ్యంబులు.

యకారంబును వు వూ వొ వో లును దెలుఁగుమాటలకు మొదట లేవు ౧౭.

ఎవఁడు - ఎక్కడ - ఏమి - ఏల - ఉండ - ఊరు ఒకఁడు - ఓడ. హరియయెఁడు - నిద్రవోయె నిట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకార వకారంబులుగాని పూర్వసిద్ధంబులు గావు. వోఢృ వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృతసమంబులందు సహితము వు వూ వొ వో వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది. ఉదకము-ఊర్మిక-ఓదనము.

యరలవలు లఘువులని యలఘువులని ద్వివిధంబులగు ౧౮.

హరియతఁడు - ఇత్యాదులం దాగమ యకారము లఘువు; తక్కిన యకార మలఘువు. విఱుగు మెఱుఁగిత్యాదులందు రేఫం బలఘువు. ఇదే శకటరేఫ మని చెప్పఁబడును. శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు. పెరుగు కర గిత్యాదులందు రేఫంబు లఘువు. ఏళులు పాళులు త్రాళులని బహుత్వమందు రలడల కాదేశ మయిన ళకార మలఘువు. తల-నెల యిత్యాదులందలి లకారము లఘువు. అతఁడు వలికె నిత్యాదులందున్న పాదేశ వకారము లఘువు. తక్కిన వకార మలఘువు. [2]వర్ణసమా

1. అరసున్న, నిండుసున్న. 2. అక్షరముల సముదాయము.

మ్నాయమందలి శకారము వర్ణాంతరము గాని యలఘు శకారము గాదని యెఱుంగునది.

సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాష తత్సమంబు ౧౯.

| సంస్కృతము. | సంస్కృతసమము. | సంస్కృతము. | సంస్కృతసమము. |
|---|---|---|---|
| రామః | రాముఁడు | గౌః | గోవు |
| విద్యా | విద్య | నౌః | నావ |
| హరిః | హరి | ద్యౌః | దివి |
| ధేనుః | ధేనువు | హృద్ | హృది |
| భూః | భువి | జగత్ | జగత్తు / జగము |
| పితా | పిత | | |

ఇత్యాదు లూహ్యంబులు.

| సంస్కృతము. | ప్రాకృతము. | ప్రాకృతసమము. |
|---|---|---|
| అగ్నిః | అగ్గి | అగ్గి |
| అటిః | అడీ | అడి |
| ఆలిః / పఙ్క్తి | ఓలీ | ఓలి |
| కటుః | కారో | కారము |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | జడ |
| మిరా | మేరా | మేర |
| యమః | జమో | జముఁడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |

| సంస్కృతము. | ప్రాకృతము. | ప్రాకృతసమము. |
|---|---|---|
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాదు లెఱుంగునది.

సంస్కృత ప్రాకృత [1]భవంబగు భాష తద్భవంబు ౨౦.

| సంస్కృతము. | సంస్కృతభవము. | సంస్కృతము. | సంస్కృతభవము. |
|---|---|---|---|
| ఆకాశః | ఆకసము | కుడ్యమ్ | గోడ |
| చన్ద్రః | చందురుఁడు | తమజ్గః | తమగము |
| తామరసమ్ | తామర | నారాచః | నారసము |
| నిభః | నెపము / నెవము | ముఖమ్ | మొకము / మొగము |
| మృగః | మెకము / మెగము | వక్రః | వంకర |
| వేసరః | వేసడము | సముద్రః | సంద్రము |
| సూచీ | సూది | స్మరః | మరుఁడు |
| హారిణమ్ | అరిణము | హరితాళమ్ | హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము. | ప్రాకృతము. | ప్రాకృతభవము. |
|---|---|---|
| అఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చెర |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ | పణ్ణాసా | పనస |
| పృథివీ | పుఢవి | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |

1. పుట్టినది.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| ప్రవాళః | పవాళో | పవడము<br>పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వెజ్జో | వెజ్జు |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరమ్ | తోరము |

ఇత్యాదులు తెలియునది.

త్రిలింగదేశవ్యవహారసిద్ధంబగు భాష దేశ్యంబు ౨౧.

ఊరు - పేరు - ఇల్లు - ముల్లు-కోట-పేట-దూడ-మేడ-కోఁత-లేఁత-తావి-మోవి——ఇత్యాదు లరయునది.

లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు ౨౨.

వస్తాఁడు-తెస్తాఁడు-వచ్చేని - తెచ్చేని - వచ్చేవాఁడు - తెచ్చేవాఁడు - వచ్చేటివాఁడు - తెచ్చేటివాఁడు ఈ భాష ప్రయోగంబున కనర్హంబు.

ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు ౨౩.

పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యంబయిన గ్రహింపఁ దగునని తాత్పర్యము. కలకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.



# సంధిపరిచ్ఛేదము

[1]ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు ౧.

పూర్వపర [2]స్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు.

| | | | | |
|---|---|---|---|---|
| రాముఁడు | + | అతఁడు | ... | రాముఁడతఁడు |
| సోముఁడు | + | ఇతఁడు | ... | సోముఁడితఁడు |
| మనము | + | ఉంటిమి | ... | మనముంటిమి |
| అతఁడు | + | ఎక్కడ | ... | అతఁడెక్కడ |
| ఇతఁడు | + | ఒకఁడు | ... | ఇతఁడొకఁడు |

ప్రథమేతరవిభక్తి [3]శత్రర్థచువర్ణంబులందున్న యికారమునకు సంధి [4]వైకల్పికముగా నగును ౨.

నన్నుఁగ + అడిగె ... { నన్నడిగె / నన్నునడిగె }

---

1. ఉత్తు - హ్రస్వమగు ఉ.
2. స్వరము - అచ్చు.
3. శత్రర్థ - వర్తమానార్థ బోధకము.
4. రెండు రూపములుండుట.

నాకొఱకుఁ + ఇచ్చె ... { నాకొఱకిచ్చె / నాకొఱకునిచ్చె }

నాకుఁ + ఆదరువు ... { నాకాదరువు / నాకునాదరువు }

నాయందుఁ + ఆశ ... { నాయందాశ / నాయందునాశ }

ఇందుఁ + ఉన్నాఁడు ... { ఇందున్నాఁడు / ఇందునున్నాఁడు }

ఎందుఁ + ఉంటివి ... { ఎందుంటివి / ఎందునుంటివి }

వచ్చుచుఁ + ఉండెను ... { వచ్చుచుండెను / వచ్చుచునుండెను }

చూచుచుఁ + ఏగెను ... { చూచుచేగెను / చూచుచునేగెను }

**సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు ౩.**

ఆగమంబనఁగా వర్ణాధిక్యంబు.

మా + అమ్మ ... మాయమ్మ

మీ + ఇల్లు ... మీయిల్లు

మా + ఊరు ... మాయూరు

[1]అత్తునకు సంధి [2]బహుళముగా నగు ౪.

మేన + అల్లుఁడు ... { మేనల్లుఁడు / మేనయల్లుఁడు

పుట్టిన + ఇల్లు ... { పుట్టినిల్లు / పుట్టినయిల్లు

చూడక + ఉండెను ... { చూడకుండెను / చూడకయుండెను

బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమసంబోధనాంతంబులకు సంధి లేదు.

అమ్మ + ఇచ్చెను ... అమ్మయిచ్చెను
దూత + ఇతఁడు ... దూతయితఁడు
చెలువుఁడ + ఇందము ... చెలువుఁడయిందము

సంస్కృతీయంబునకు సంధి యగునని యథర్వణాచార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు [3]మృగ్యంబు. ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచకతత్సమంబులకు సంధి గానంబడియెడు. గంగను గాంచె, నెలఁతిచ్చెను, నెలయూల్వోగుల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది.

1. అత్తు – హ్రస్వమగు అ.
2. బహుళము – కొన్నిచోట్లఁ బ్రవృత్తి, కొన్నిచోట్ల నిషేధము, కొన్నిచోట్ల వికల్పము, కొన్నియెడల మఱొకరీతిగ నగుట.
3. మృగ్యము – వెదుకఁదగినది.

ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగానగు ౫.

ఏమి-మఱి-కిషష్ఠి-అది-అవి-ఇది-ఇవి-ఏది-ఏవి——ఇది యాకృతిగణంబు.

ఏమి + అంటివి ... { ఏమంటివి / ఏమియంటివి

మఱి + ఏమి ... { మఱేమి / మఱియేమి

హరికిఁ + ఇచ్చె ... { హరికిచ్చె / హరికినిచ్చె

క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగానగు ౬.

వచ్చిరి + అప్పుడు ... { వచ్చిరప్పుడు / వచ్చిరి యప్పుడు

వచ్చితిమి + ఇప్పుడు ... { వచ్చితిమిప్పుడు / వచ్చితిమి యిప్పుడు

మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును ౭.

ఏలితివి + అపుడు ... ఏలితివపుడు

ఏలితి + ఇపుడు ... ఏలితిపుడు

ఏలితిరి + ఇపుడు ... ఏలితిరిపుడు.

---

1. ఇత్తు - హ్రస్వమగు ఇకారము.

క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు ౮.

వచ్చి + ఇచ్చెను ... వచ్చియిచ్చెను

ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు ౯.

ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.

వచ్చున్ + ఇపుడు ... వచ్చునిపుడు

చూడన్ + అయితి ... చూడనయితి

ఉండెడిన్ + అతఁడు ... ఉండెడినతఁడు

ఇఁక-ఇఁగ-ఎట్టకేలకు-ఎట్టకేని—ఈయవి యిఁకాదులని యెఱుంగునది. వీనికి సంధి వైకల్పికము.

అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు ౧౦.

ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనంబడు. తఱుచుగ ననుటచేత నొక్కానొకచోట వైకల్పికసంధియుం గలదని తాత్పర్యము.

ఔర + ఔర ... ఔరౌర.

ఆహా + ఆహా ... ఆహాహా.

ఎట్టా + ఎట్టా ... ఎట్టెట్టా

ఓహో + ఓహో ... ఓహోహో.

ఏమి + ఏమి ... { ఏమేమి / ఏమియేమి }

ఏగియేగి యనుచోఁ గ్త్వార్థంబగుట సంధి లేదు.

**అంద్వగాగమంబులు దప్ప [1]నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు ౧౧.**

| | | | | |
|---|---|---|---|---|
| మూర | + | ఎఁడు | ... | మూరెఁడు. |
| పీసె | + | ఎఁడు | ... | పీసెఁడు. |
| అర్థ | + | ఇంచు | ... | అర్థించు. |
| నిర్జ | + | ఇంచు | ... | నిర్జించు. |

అంద్వగాగమంబులు పరంబులగునపుడు యథాసంభవముగా గ్రహించునది. రాములందు – రాముల యందు – హరియందు – ఎనిమిదవది – ఎనిమిదియవది.

**కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల డల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు ౧౨.**

| | | | | |
|---|---|---|---|---|
| కుఱు | + | ఉసురు | ... | కుట్టుసురు. |
| చిఱు | + | ఎలుక | ... | చిట్టెలుక. |
| కడు | + | ఎదురు | ... | కట్టెదురు. |
| నడు | + | ఇల్లు | ... | నట్టిల్లు. |
| నిడు | + | ఊరుపు | ... | నిట్టూరుపు. |

1. అపదాదిస్వరము – పదము కాని ప్రత్యయము యొక్క మొదటి యచ్చు.

ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు ౧౩.

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | + | కొట్టె | ... | వాఁడు గొట్టె. / వాఁడు కొట్టె. |
| అపుడు | + | చనియె | ... | అపుడు సనియె. / అపుడు చనియె. |
| నీవు | + | టక్కరివి | ... | నీవు డక్కరివి. / నీవు టక్కరివి. |
| మీరు | + | తలఁడు | ... | మీరు దలఁడు. / మీరు తలఁడు. |
| వారు | + | పోరు | ... | వారు వోరు. / వారు పోరు. |

అప్డు ఇప్డు ఎప్డు డను శబ్దములు నిత్యైకవచనాంతములు; [1]వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుఁగునది. ఈ కార్యము కళలగు క్రియాపదములమీఁద సహితము కానంబడియెడి.

| | | | | |
|---|---|---|---|---|
| రారు | + | కదా | ... | రారు గదా. / రారు కదా. |
| వత్తురు | + | పోదురు | ... | వత్తురు వోదురు. / వత్తురు పోదురు. |

1. వాగనుశాసనులు - నన్నయభట్టు.

తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు ౧౪.

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | + | కంసారి | ... | వాఁడు కంసారి |
| వీఁడు | + | చక్రపాణి | ... | వీఁడు చక్రపాణి |
| ఆయది | + | టంకృతి | ... | ఆయది టంకృతి |
| అది | + | తథ్యము | ... | అది తథ్యము |
| ఇది | + | పథ్యము | ... | ఇది పథ్యము |

ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు ౧౫.

| | | | | |
|---|---|---|---|---|
| కూర | + | కాయ | ... | కూరగాయలు |
| కాలు | + | చేయి | ... | కాలుసేతులు |
| టక్కు | + | టెక్కు | ... | టక్కుడెక్కులు |
| తల్లి | + | తండ్రి | ... | తల్లిదండ్రులు |
| ఊరు | + | పల్లె | ... | ఊరుపల్లెలు |

ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు ౧౬.

| | | | | |
|---|---|---|---|---|
| పూచెను | + | కలువలు | ... | పూచెను గలువలు |
| తోఁచెను | + | చుక్కలు | ... | తోఁచెను జుక్కలు |
| చేసెను | + | టక్కులు | ... | చేసెనుడక్కులు |
| నెగడెను | + | తమములు | ... | నెగడెనుదమములు |
| మొగిడెను | + | పద్మము | ... | మొగిడెనుబద్మము |

ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు
సంశ్లేషములు విభాషనగు ౧౭.

సంశ్లేషం బనఁగా మీఁదిహల్లులతోఁ గూడికొనుట.

| | | |
|---|---|---|
| పూచెనుగలువలు | ... | పూచెంగలువలు.<br>పూచెఁగలువలు.<br>పూచెన్గలువలు. |
| తోఁచెనుజుక్కలు | ... | తోఁచెంజుక్కలు.<br>తోఁచెఁజుక్కలు.<br>తోఁచెన్జుక్కలు. |
| చేసెనుడక్కులు | ... | చేసెండక్కులు.<br>చేసెఁడక్కులు.<br>చేసెన్డక్కులు. |
| నెగడెను దమములు | ... | నెగడెందమములు.<br>నెగడెఁదమములు.<br>నెగడెన్దమములు. |
| మొగిడెను బద్మము | ... | మొగిడెంబద్మము.<br>మొగిడెఁబద్మము.<br>మొగిడెన్బద్మము. |

పక్షంబున స్వాత్వంబగు; స్వాత్వంబనఁగా ద్రుతంబునకుఁ ప్రకృతిభావము.

ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోప సంశ్లేషంబులు విభాషనగు ౧౮.

వచ్చెను + గోవులు ... { వచ్చెగోవులు. / వచ్చెన్గోవులు. / వచ్చెనుగోవులు.

మెఱసెను + ఖడ్గము ... { మెఱసెఖడ్గము. / మెఱసెన్ఖడ్గము. / మెఱసెనుఖడ్గము.

వర్గయుక్సరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి ౧౯.

వచ్చెను + ధాత్రీపతి ... వచ్చెంధాత్రీపతి.

పాడెను + గంధర్వుఁడు ... పాడెంగంధర్వుఁడు

కన్ + దోయి ... కందోయి.

[1]అవసానంబునందు ద్రుతస్వరంబునకేని, ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు ౨౦.

వాఁడువచ్చెన్ – వాఁడువచ్చె – వాఁడువచ్చెను; ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయియుండు. గుర్వవసాయి యగు పద్యంబుతుదను స్వాత్వ్యంబు లేదు. "అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్."

1. అవసానము – వాక్యముయొక్క చివర.

కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి ౨౧.

అదియునున్నాన్, దివంబునుంబోలెన్.

అఁట యిఁక చుఁడు శబ్దంబులందప్పు [1]నుడితొలి హ్రస్వంబు మీఁద ఖండబిందువును, ద్రుతంబునకు లోపంబును లేవు ౨౨.

ముంగొంగు - క్రొంబసిఁడి - కన్దోయి

తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు ౨౩.

తాను + చదివె ... { తాఁ జదివె. / తాను జదివె.

తాను + వినె ... { తా వినె. / తాను వినె.

దీర్ఘంబుమీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.

సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు ౨౪.

ఎల్లయర్థములు - ఎల్లకలుషములు ; సర్వపర్యాయంబయిన యెల్లశబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీనికి సమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.

1. నుడి - పదము.

సమాసంబుల నుదంతంబులగు [1]స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు — ౨౫.

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులచే మూఁడురూపంబులు. సరళంబులు పరంబులగునపుడు లోప సంశ్లేష పూర్ణ బిందువులచేత మూఁడు రూపములు. విధానసామర్థ్యమువలన దీనికి లోపము లేదు. వక్ష్యమాణవిధిచే స్వత్వము లేదు.

చిగురు + కయిదువు ... { చిగురుంగయిదువు. / చిగురుఁగయిదువు. / చిగురున్గయిదువు.

తళుకు + గజ్జెలు ... { తళుకుగజ్జెలు. / తళుకున్గజ్జెలు. / తళుకుంగజ్జెలు.

సింగపు + కొదమ ... { సింగపుంగొదమ. / సింగపుఁగొదమ. / సింగపున్గొదమ.

ఉన్నతంపు + గొడుగు ... { ఉన్నతంపుగొడుగు. / ఉన్నతంపున్గొడుగు. / ఉన్నతంపుంగొడుగు.

1. స్త్రీసమములు - ప్రథమైకవచన ప్రత్యయము లోపించిన నపుంసకలింగపదములు.

నలుఁగడాదుల నీయాగమంబు లేదండ్రు. ఈయాగమం-బొకానొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి—గలువపున్మరువు.

**సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు ౨౬.**

**తలఁబ్రాలు మొదలగుసమాసంబుల ద్రుతమునకు లోపములేదు ౨౭.**

తలఁబ్రాలు – ఒడిఁబ్రాలు – సేసఁబ్రాలు – ఊరఁబంది – ఊరఁబిచ్చిక – తోడఁబుట్టువు – తోఁబుట్టువు – ఒల్లఁబాటు – ఒడఁబాటు—ఇత్యాదులు.

**కర్మధారయంబునం దుత్తున కచ్చుపరంబగునపుడు టుగాగమంబగు ౨౮.**

కఱకు + అమ్మ ... కఱకుటమ్మ.
నిగ్గు + అద్దము ... నిగ్గుటద్దము.
సరసపు + అలుక ... సరసపుటలుక.

**కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు ౨౯.**

పేరు + ఉరము ... { పేరుటురము. / పేరురము.

చిగురు + ఆకు ... { చిగురుటాకు. / చిగురాకు.

పొదరు + ఇల్లు ... { పొదరుటిల్లు. / పొదరిల్లు.

**పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు ౩౦.**

పేద + ఆలు ... పేదరాలు.

బీద + ఆలు ... బీదరాలు.

పేద - బీద - ముద్ద - బాలింత - కొమ - జవ - అయిదువ - మనుమ - గొడ్డు—ఇట్టివి పేదాదులు. ఇందు జవ్వనిశబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది. "పేకాంతమునందు నున్న జవరాండ్ర" నని ప్రయోగము.

**కర్మధారయంబునం దత్సమంబులకాలుశబ్దముపరంబగునపుడత్వంబున కుత్వంబును, రుగాగమంబు నగు ౩౧.**

ధీర + ఆలు ... ధీరురాలు.

గుణవంత + ఆలు ... గుణవంతురాలు.

ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము.

**కర్మధారయంబునందు [1]మువర్ణకంబునకుం బుంపులగు౩౨.**

సరసము + మాట ... { సరసపుమాట. / సరసంపుమాట.

విరసము + వచనము ... { విరసపువచనము. / విరసంపువచనము.

---

1. వర్ణకము - ప్రత్యయము.

ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చుపరమగునపుడు నుగాగమంబగు ౩౩.

చేయు + అతఁడు ... చేయునతఁడు.

చేసెడు + అతఁడు ... చేసెడునతఁడు.

షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు ౩౪.

రాజుయొక్క + ఆజ్ఞ ... రాజునాజ్ఞ.

విధాతృయొక్క + ఆనతి ... విధాతృనానతి.

ఉదంతస్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణ వాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు ౩౫.

సొగసు + తనము ... { సొగసుందనము. / సొగసుఁదనము. / సొగసున్దనము.

సరసపు + తనము ... { సరసపుందనము. / సరసపుఁదనము. / సరసపున్దనము.

తెల్ల + తనము ... { తెల్లందనము. / తెల్లఁదనము. / తెల్లన్దనము.

సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు ౩౬.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాఁత | + | ఇల్లు | ... | ప్రాయిల్లు. ప్రాఁతయిల్లు. |
| లేఁత | + | దూడ | ... | లేదూడ. లేఁతదూడ. |
| పూవు | + | రెమ్మ | ... | పూరెమ్మ. పూవురెమ్మ. |

లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు ౩౭.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాఁత | + | కెంపు | ... | ప్రాఁగెంపు. |
| లేఁత | + | కొమ్మ | ... | లేఁగొమ్మ. |
| పూవు | + | తోఁట | ... | పూఁదోఁట. |
| మీఁదు | + | కడ | ... | మీఁగడ. |
| కెంపు | + | తామర | ... | కెందామర. |
| చెన్ను | + | తావ | ... | చెందావ. |

చెన్నుశబ్దము వృత్తిని శోణార్థకంబు; బహుళగ్రహణముచే మీఁదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు; వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

1. లుప్తశేషము – ౩౬–వ సూత్రమువలన లోపము పొంది మిగిలిన పదము.

**క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం, గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు ౩౮.**

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్త | + | జాయ | ... | క్రొంజాయ. |
| క్రొత్త | + | చెమట | ... | క్రొంజెమట. |
| క్రొత్త | + | పసిఁడి | ... | క్రొంబసిఁడి. |
| క్రొత్త | + | కారు | ... | క్రొక్కారు. |
| క్రొత్త | + | తావి | ... | క్రొత్తావి. |

పరుషేతరంబులు పరంబు లగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వంబగు.

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్త | + | గండి | ... | క్రొగ్గండి. |
| క్రొత్త | + | నన | ... | క్రొన్నన. |
| క్రొత్త | + | మావి | ... | క్రొమ్మావి. |

కెంధూళి కెంజడ లని ప్రయోగంబులు గానంబడియెడి. బహుళగ్రహణము చేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు. క్రీఁగడుపు – క్రీఁగాలు – క్రీఁదొడ—ఇత్యాదులం గ్రిందు శబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణము చేసినని యెఱుఁగునది.

**అన్యంబులను సహిత మిట్టికార్యంబులు గొండొకచోఁ గానంబడియెడి ౩౯.**

ఒకానొకశబ్దంబున కొకానొకశబ్దము పరంబగునపుడు

తొంటియట్లు లోప నుగాగమంబులును, గొంగోకశబ్దమున కోకానోకశబ్దము పరంబగునపుడు లోపద్విత్వంబులును బ్రయోగంబులందుఁ జూపట్టెడు నని తాత్పర్యము.

| | | | | |
|---|---|---|---|---|
| పది | + | తొమ్మిది | ... | పందొమ్మిది. |
| తొమ్మిది | + | పది | ... | తొంబది. |
| వంక | + | చెఱఁగు | ... | వంజెఱఁగు. |
| సగము | + | కోరు | ... | సంగోరు. |
| నిండు | + | వెఱ | ... | నివ్వెఱ. |
| నిండు | + | వెఱఁగు | ... | నివ్వెఱఁగు |
| నెఱ | + | తఱి | ... | నెత్తఱి |
| నెఱ | + | నడుము | ... | నెన్నడుము. |
| నెఱ | + | మది | ... | నెమ్మది. |
| నెఱ | + | వడి | ... | నెవ్వడి. |

ఇత్యాదులు ప్రయోగంబువలనం దెలియునది.

ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారం బగు. ౪౦.

ఈ సూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది.

| | | | | |
|---|---|---|---|---|
| కడ | + | కడ | ... | కట్టకడ. |
| ఎదురు | + | ఎదురు | ... | ఎట్టఎదురు. |

కడ—ఎదురు—కొన – చివర – తుద – తెన్ను – తెరువు – నడుము—పగలు – పిడుగు – బయలు – మొదలు——ఇత్యాదులు కడాదులు.

ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు ౪౧.

అప్పటికిన్ + అప్పటికిన్ ... { అప్పటప్పటికిన్. / అప్పటికప్పటికిన్.

అక్కడన్ + అక్కడన్ ... { అక్కడక్కడన్. / అక్కడనక్కడన్.

ఇంటన్ + ఇంటన్ ... { ఇంటింటన్. / ఇంటనింటన్.

ఊరన్ + ఊరన్ ... { ఊరూరన్. / ఊరనూరన్.

ఇంచుక నాఁడిత్యాదులందు బహుళగ్రహణముచేత నంత్యమాత్రలోపంబు నగు.

ఇంచుక + ఇంచుక ... { ఇంచించుక. / ఇంచుకించుక.

నాఁడు + నాఁడు ... { నానాఁడు / నాఁడునాఁడు.

అందదుకుప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు ४२.

అందదుకు–ఇఱ్ఱింకులు – ఇల్లిగ్గులు – చెల్లచెదరు – చెల్లాచెదరు–తుత్తుమురు – తుత్తునియలు – మిఱుమిట్లు—ఇత్యాదు లెఱుంగునది.

చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులం దగు ४३.

| | | | | |
|---|---|---|---|---|
| నీచేతన్ | + | ప్రోపు | ... | నీచేతిప్రోపు. |
| నాతోడన్ | + | చెలిమి | ... | నాతోడిచెలిమి. |
| నీవలనన్ | + | భయము | ... | నీవలనిభయము. |

అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు ४४.

| | | | | |
|---|---|---|---|---|
| నాయందున్ | + | కరుణ | ... | నాయందలికరుణ. |
| ఇందున్ | + | జనులు | ... | ఇందలిజనులు. |
| ఎందున్ | + | వారు | ... | ఎందలివారు. |

ఎందు శబ్దంబున కలిగాగమము కొందఱు లేదంద్రు.

అది యవి శబ్దంబుల యత్తునకు [1]వృత్తిని లోపంబు బహుళంబుగ నగు ४५.

| | | | | |
|---|---|---|---|---|
| నా | + | అది | ... | నాది. / నాయది. |

1. వృత్తి – సమాసము.

నా + అవి ... { నావి. / నాయవి.

ఉదంతములగు తద్ధర్మవిశేషణంబులకు మీఁదలోపంబు లేదనియు, నిదంతంబులగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద నిత్యంబనియు బహుళగ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది-వచ్చునవి—వచ్చెడిది-వచ్చెడివి.

[1]పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాష నగు ౪౬.

భయము + పడె ... { భయపడె. / భయంపడె. / భయముపడె.

సూత్రము + పట్టె ... { సూత్రపట్టె. / సూత్రంపట్టె. / సూత్రముపట్టె.

ఈకార్యము కర్తృవాచి మువర్ణకమునకుఁ గలుగదు.

గజము పడియె-అశ్వము పడియె.

మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు ౪౭.

చూడుము + నన్ను ... { చూడునన్ను. / చూడుమునన్ను.

1. పడు+ఆదులు - పడు, పాటు, పట్టు, పఱచు, పెట్టు - వెం

ఇటు + చూడుము ... { ఇటు చూడు. / ఇటు చూడుము.

చూడుమనియె—వినుమనియె, ఇచ్చట నచ్చు పరంబయి నది కాఁబట్టి లోపము లేదు.

వ్యతిరేకమధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు ౪౮.

నమ్మకుము + ఇటు ... { నమ్మకిటు. / నమ్మకుమిటు.

ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ము[1]డుజ్జులకు లోపంబు విభాషనగు ౪౯.

ఉండుము + ఉండుము ... { ఉండుండుము. / ఉండుముండుము.

కొట్టుఁడు + కొట్టుఁడు ... { కొట్టు కొట్టుఁడు. / కొట్టుఁడుకొట్టుఁడు.

విసర్గంబున కనుకరణంబున లోపంబగు ౫౦.

వర్ధతాం శ్రీః + అనియె...వర్ధతాం శ్రీ యనియె.

అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాషనగు ౫౧.

తుభ్యం నమః + అనె... { తుభ్యం నమోయనె. / తుభ్యం నమయనె.

---

1. డుజి = అరసున్నతోఁ గూడిన డు అని తెలియునది.

ఈకార్యము లాంతిచో సహితము గనంబడియెడి-
గతానుగతికో లోకో యటంచుఁ.

**అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు** ౫౨.

కింతత్ + అనియె ... కింతత్తనియె.

కస్త్వమ్ + అనియె ... కస్త్వమ్మనియె.

**అనుకరణంబునం దహామాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు** ౫౩.

దాసోహమ్ + అనె ... { దాసోహమ్మనె. / దాసోహమనె.

తత్కర్తవ్యమ్ + అనె ... { తత్కర్తవ్యమ్మనె. / తత్కర్తవ్యమనె.

**ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమంబగు.**

ఇయంధేనుః + అనె ... ఇయంధేనువనె.

అనుకృతిని నిడుదకుం గుఱుచ యగునని యొకండు వలికె నది నిరాకరంబు. దుర్బలస్య బలం రాజా యని వినవే.

**వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదని యార్యులందురు** ౫౪.

సత్యము సర్వశ్రేయము - అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు. ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంత మందు చూపట్టెడు.

ఇది సంధిపరిచ్ఛేదము.



# తత్సమ పరిచ్ఛేదము



డు-ము-వు-లు—ప్రథమ ౧. నువర్ణంబు—ద్వితీయ ౨.
చేత-తోడ—తృతీయ ౩. కొఱకు-కయి—చతుర్థి ౪.
వలన-కంటె-పట్టి—పంచమి ౫. కు-యొక్క-
లోపల—షష్ఠి ౬. అందు-న—సప్తమి ౭.

తృతీయాదులకు నుగాగమంబగు ౮.

రామునిచేతను - రామునితోడను-రామునికొఱకును-రామునివలనను - రామునికంటెను - రామునపట్టను - రాముని యందును.

కయి-పట్టి-యొక్క-లకు నుగాగమంబు లేదు ౯.

రామునికయి - జ్ఞానముఁబట్టి - రామునియొక్క.

చేత-తోడ-లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు ౧౦.

ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు.
రామునిచే-రామునితో-వనములలో.

డు-ము-వు-న లేకవచనంబులు ౧౧.

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు.
రాముఁడు-సోముఁడు-వనము-ధేనువు-భానువు.

### లువర్ణంబు బహువచనంబు ౧౨.

బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు. రాములు-సోములు-వనములు-ధనములు-ధేనువులు-భానువులు.

### తక్కినవి యుభయంబులు ౧౩.

మిగిలిన ప్రత్యయములు ఏకత్వ బహుత్వములకు బోధకములని యర్థము. వనమును-వనములను; వనముచేతను-వనములచేతను; వనముతోడను-వనములతోడను.

### ఓ[1] యామంత్రణంబునందగు ౧౪.

ఓ యను శబ్దము సంబోధనంబునం దగునని యర్థము. ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపంబడును. ఓశబ్దంబు లేకయు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును. ఓ రాముఁడ-ఓ రాములార, రాముఁడ-రాములార.

### ఓశబ్దంబునకుం బురుష నీచ స్త్రీపురుషామంత్రణంబులందు యి-సి-రి వర్ణంబులు విభాష నంతాగమంబులగు ౧౫.

ఓయి రాముఁడ - ఓ రాముఁడ — ఓసి దుష్టురాల - ఓదుష్టురాల — ఓరి దుష్టుఁడ - ఓ దుష్టుఁడ.

### ఓరి యోసి మైత్రియందుం గలవు ౧౬.

ఓరి చిన్నికృష్ణ-ఓసి ముద్దుబాల. ఓయి మొదలయిన వానికి స్వాతంత్ర్య ప్రయోగముం గలదు. సంగతియె యోయి-

1. ఆమంత్రణము - పిలుపు.

ఓసి పోవే-ఓరోరి యింకెందుఁ బోవచ్చు? వీనికి దీర్ఘంబుం గలదు. ఓయీ విప్రకులావతంస - ఓరీ దుష్టనిశాచరులార - ఓసీ ననుఁ జెనకరాకు.

**స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వాని విశేషణంబులును మహత్తు లనంబడు ౧౭.**

తిర్యక్కు లనఁగాఁ బశుపక్ష్యాదులు. జడము లనఁగా నచేతనములు.

**క్లీబంబులు మిత్త్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబులగు ౧౮.**

మిత్త్ర శరణ ప్రధాన పాత్త్రాదులు మిత్త్రాదులు.

**జిత్తు బిందుపూర్వంబగు ౧౯.**

జకార మిత్తుగాఁ గలదానికి ముందు బిందువు వచ్చునని యర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడు వర్ణ మిత్తు నాఁబడును. ఉదాహరణము మీఁద స్పష్టంబగు.

**డుజ్వర్ణకంబునకుం బ్రకృతియయినది డుమంతంబనంబడు.**

స్పష్టము.

**పుంలింగంబయి మహద్వాచకం బయిన నామంబు తుదియత్వంబున కుత్వంబగు ౨౧.**

నామంబనఁగాఁ బ్రాతిపదికము. సిద్ధ-రామ-భార్గవ-రాజపురుష-ఇట్టివి ప్రాతిపదికములు. సిద్ధు-రాము-భార్గవు-రాజపురుషు.

పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్గు ౨౨.

ఇచ్చట డుజ్గనుదానియందు జకార మిత్తుగావున "జిత్తు బిందుపూర్వం బగు" ననుసూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును. పిమ్మట జకారము లోపించును. ఉదా. ఉద్ధుఁడు—ఉద్ధుండు; రాముఁడు—రాముండు; భార్గవుఁడు—భార్గవుండు.

డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు ౨౩.

రామునిని — రాముని; రామునిచేతను — రాముచేతను; రామునికని — రామునకును. సర్వత్ర యనుట నిగాగమబాధనార్థము.

అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును ౨౪.

మగనిని — మగనిచేతను — మగనికిని. అనుదంత మను పర్యుదాసముచేత తమ్మునిని — తమ్ముని; తమ్మునిచేతను—తమ్ము చేతను; అల్లునిని — అల్లుని; అల్లునిచేతను — అల్లుచేతను; బల్లిదునిని—బల్లిదుని; బల్లిదునిచేతను — బల్లిదుచేతను—ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికంబని యెఱుఁగునది.

డుమంతంబుమీఁది నువర్ణకంబునుత్వంబున కిత్వంబగు.

"నువర్ణంబు ద్వితీయ" యను సూత్రముచేత రామును—అని ప్రాప్తింపఁగా నీసూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె. రాముని—భార్గవుని.

ఇకారంబుమీఁది కు-ను-వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు ౨౬.

హరిని - హరికిని; శ్రీని - శ్రీకిని; వారిని - వారికిని.

ఈధాతు యుష్మదర్థంబులమీఁదివాని యుత్వంబున కిత్వంబు రాదు ౨౭.

ఈరు - ఈవు - ఈను - ఈము, ఈకు - నీకు - మీకు.

కువర్ణకంబు పరంబగునపు డుకారఋకారంబులకు నగాగమంబగు ౨౮.

రామునకును - విష్ణునకును - సవితృనకును - విధాతృనకును.

ఉకారఋకారంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబగు ౨౯.

రామునందును - విష్ణునందును - విధాతృనందును.

ఆగమ ము-వు వర్ణంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాషనగు ౩౦.

వనమునందును - వనమందును; ధేనువునందును - ధేనువందును.

బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమంబగు ౩౧.

రాములను - రాములచేతను; విధాతృలను - విధాతృలచేతను.

సంబోధనంబునం దేకార్థంబయిన పదంబుతుది యుకారంబున కకారంబగు ౩౨.

ఓరాముఁడ-ఓవృక్షమ-ఓశంభువ-ఓకొడుక.

సంబోధనంబునందుఁ బదంబుతుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు ౩౩.

ఓరాముఁడా - ఓరాముఁడ. ఓ చెలియా - ఓ చెలియ. ఓహరీ-ఓహరి. ఓతండ్రీ - ఓతండ్రి.

కృతోత్కంబగు సంస్కృతనామంబు సంబుద్ధి డుజ్ఞకు లోపంబు విభాషనగు ౩౪.

ఓరామ - ఓకృష్ణ. పూర్వసూత్రముచేత దీర్ఘంబు. ఓరామా-ఓకృష్ణా. సంస్కృతనామంబనుటఁ జేసి ఓతమ్ముఁడ- ఓబల్లిదుఁడ ఇత్యాదులందు లోపంబు లేదు.

ఉదంత సంస్కృతనామంబుమీఁది సంబుద్ధి డుజ్ఞకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు ౩౫.

ఓవిష్ణూ 3 - ఓశంభూ 3. పక్షంబునందు విష్ణుఁడ - శంభుఁడ ఇత్యాది.

సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు.

ఓరాములార - ఓకృష్ణులార. దీనికిం బాక్షికంబుగ దీర్ఘంబగు—ఓరాములారా - ఓకృష్ణులారా.

## మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాషనగు ౩౭.

వినుఁడు బాలకులు – వినుఁడు బాలకులార; వచ్చితిరి కాంతలు-వచ్చితిరి కాంతలార. అన్నలార మిమ్ము నడిగెద నొకమాట-ఇచ్చట మధ్యమపురుషయోగంబు లేమిం జేసి యారగామంబు నిత్యంబు.

## అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు ౩౮.

బాలురు – బాలురను – బాలుర చేతను, నృపాలురు-నృపాలురను – నృపాలుర చేతను. దయాళుశబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి. దయాళురు – దయాళురను – దయాళుర చేతను.

## అమహాన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు.

వృక్షము–ఋక్షము–దైవము–కళత్రము – అపత్యము. "క్లీబంబులు మిత్రాదు"లను సూత్రంబునఁ బాక్షికంబుగం బుంలింగత్వం బతిదేశించుటం జేసి మిత్రాదిశబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది. ఉదా. మిత్రుఁడు – మిత్రము; శరణుఁడు – శరణము.

## వానికి మువర్ణకేతరం బయిన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు ౪౦.

వృక్షములు–వృక్షమును; ఋక్షములు–ఋక్షమును.

ముवర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు ౪౧.

మువర్ణకంబునకు విధించు లోపాదేశాదికార్యములు ముగాగమమునకు సహితము వచ్చునని యర్థము.

మువర్ణకంబునకు [1]మూముడియేనిం బూర్ణబిందుపూర్వక బువర్ణంబేని విభాషనగు ౪౨.

వృక్షము-వృక్షంబు; ఋక్షమ్ము-ఋక్షంబు. పూర్వసూత్రముచేత ముగాగమమున కీకార్యంబగు. వృక్షమ్ములు-వృక్షంబులు; ఋక్షమ్ములు-ఋక్షంబులు.

లు-ల-న లు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు ౪౩.

వజ్రాలు-వజ్రాలను-వజ్రాన; పగడాలు - పగడాలను - పగడాన. ఒకానొకచోట ననుటచే నీకార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపంబడియె.

ఇద్గ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు ౪౪.

ఇకారాంతములకు గ్లౌరైశబ్దంబులకు మఱి యుగాగమాంతంబులకుం బ్రథమైకవచనలోపంబగు. హరి-గిరి-శ్రీ-ధీ.

1. మాముడి - మావత్తు (−)

ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు ౪౫.

హారులు–గిరులు–కవులు–రవులు–యామినులు – భామినులు. తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబులేదు. శ్రీలు–స్త్రీలు–లక్ష్మీలు.

వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు డుత్వంబగు ౪౬.

ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు. కలికి–కలుకులు; ములికి – ములుకులు; చెలిమి–చెలుములు; బలిమి–బలుములు. ఉపోత్తమేత్వంబునకనుటంజేసి జిగి–నిసి ఇత్యాదులం దుత్వంబులేదు. జిగులు–నిసులు.

రలడోపధ[1]నవార్థములయుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు ౪౭.

పందిరి–పందిరులు; పిడికిలి–పిడికిళులు; రాపిడి–రాపిడులు; తొమ్మిది–తొమ్మిదులు.

ఉకారాంత గోశబ్దంబుల కంతట వుఁవర్ణకంబగు ౪౮.

తరువు–ధేనువు–మధువు–గోవు. అంతట ననుట స్త్రీలింగ ప్రథమైకవచనలోపబాధనార్థము.

1. నవార్థము – తొమ్మిది యను పదము.

పువర్ణకేతరవిభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు ౪౯.

తరువులు-తరులు; ధేనువులు-ధేనులు; గోవులు.

ఉకారాంతం బగు మహత్తునకు పువర్ణకము బహుళముగా నగు ౫౦.

విష్ణువు-విష్ణుఁడు; శంభువు-శంభుఁడు; వసువు-వసుఁడు.

కద్రువ నాగమాత ౫౧.

కద్రువ-కద్రువలు; కద్రువను-కద్రువలను.

ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు ౫౨.

భ్రాత-జామాత-కర్త-భర్త-హర్త-గంత-హంత.

విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు ౫౩.

విధాత-విధాతృఁడు; ధాత-ధాతృఁడు; దాత-దాతృఁడు; సవిత-సవితృఁడు; నేత-నేతృఁడు.

నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు ౫౪.

రమా-రమ; వనితా-వనిత; విద్యా-విద్య; లక్ష్మీ-లక్ష్మి; సేనానీ-సేనాని. ఇట్లు కృత హ్రస్వములకు హ్రస్వాంతములకుఁ బోలెఁ గార్యంబగు; లక్ష్ములు-సేనానులు-సిరులు.

ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు ౫౫.

జ్ఞా-మా-భా-శ్రీ-స్త్రీ-హ్రీ-ధీ-భీ-భూర్వు.

వృద్ధాదుల డుజ్జునకు లోపంబు విభాషనగు ౫౬.

వృద్ధు-వృద్ధుఁడు; మూర్ఖు-మూర్ఖుఁడు; నీచు-నీచుఁడు; గృహస్థు-గృహస్థుఁడు; చార్వాకు-చార్వాకుఁడు.

స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబునగు ౫౭.

రమ-క్షమ-వనిత-ఘనత-విద్య-దేవత-మీననేత్ర.

చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు.

చరిత్ర-చరిత్రము; చరిత-చరితము. అలక-అభిలాష-అక్షత-ఘోష-తరంగ-భ్రమ-విజృంభణ-వధ-వేగ-స్ఫురణ-హంస ఇత్యాదులు చరిత్రాదులు. బాహుళకమువలన దర్భాదులకు ములోపంబు నిత్యంబు. దర్భ-పనస ఇత్యాదులు దర్భాదులు.

స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు ౫౯.

దేవుఁడు-సకలసురలు. స్వర్గివాచి యనుటచే భూదేవులు-భూసురుఁ డను ప్రయోగంబు లబాధితంబులయ్యె.

సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు; సంస్కృతసమాసంబునఁ గావు ౬౦.

సురలు-అసుర-అసురుఁడు. నిఖిలసురులు-రావణాసురుఁడు. ఎల్లసురలు-ఎల్లయసురలు-ఎల్లయసురులు.

దూతాదులకు [1]స్త్రీత్వంబు బహుళంబుగ నగు ౬౧.

దూత-దూతుఁడు; యోధ-యోధుఁడు; శుంఠ-శుంఠుఁడు. బహుళగ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు. సింగంబుదూత యగు జంబుకంబు.

పృథ్వీవాచిభూశబ్దంబునకు భువియగు ౬౨.

భువి-భువులు-భువిని-భువులను.

నౌశబ్దంబునకు నావ యగు ౬౩.

నావ-నావలు. మహానావ. కొందఱు నావి యనియు నాదేశం బగునందురు.

రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాషనగు ౬౪.

ఇగ్లాసూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు. రో-రై; గ్లో-గ్లౌ.

ఐకారం బీతుల్యంబు ౬౫.

రైని - రైకి; కైని - కైకి; పైని - పైకి.

కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు ౬౬.

కంధరము - కంధర. విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు-విధము. కంధరా నాసికా భిక్షా దంష్ట్రా గ్రీవా పాదు కోల్కా ప్రభృతులు కంధరాదులు.

1. ప్రథమైకవచన ప్రత్యయములు రాకుండుట.

## హలంతప్రకరణము

**హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబిందునామంబగు. ౭౬.**

రుక్-రాట్-మరుత్-వీరుత్-కర్మ-వర్మ. శ్వశబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచనతుల్యంబు లే యగునని యెఱుంగునది.

**ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు ౭౭.**

ఉగాగమాంతంబుల కీగ్లాసూత్రముచేఁ బ్రథమైక వచనలోపంబగు. రుక్కు - రాట్టు - మరుత్తు-వీరుత్తు. ఉగా గమంబు లేమిం జేసి యిచట నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు. కర్మము-వర్మము-చర్మము-సుధన్వుఁడు-సుత్రాముఁడు.

**దీర్ఘంబుమీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు ౭౮.**

వాక్కు - వాకు; స్వరాట్టు - స్వరాటు.

**మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామంబగు.**

శ్రీమంతమ్-గుణవంతమ్-విద్వాంసమ్-అనడ్వాహమ్-శ్వానమ్-ఉపానహమ్-అప్సరసమ్ ఇత్యాదులు.

**దాని యంతిమమకారంబునకు లోపంబగు ౭౯.**

శ్రీమంత-గుణవంత-విద్వాంస-అనడ్వాహ-ఇత్యాది. వీని కజంతములకుం బోలె డుజాదులు యథాయోగ్యంబుగ నగు. అతఁడు శ్రీమంతుఁడు - ఇతఁడు గుణవంతుఁడు-వాని వంశము శ్రీమంతము-వీనివంశము గుణవంతము. విద్వాంసుఁడు-విద్వాంసము. అనడ్వాహము - శ్వానము - అప్సరస.

సత్వంబు గలుగుతను. సంప్రార్థనంబు - హరి నను గృపం గాంచెదను-హరి నను గృపంగాంచుతను.

**విధియందు లూట్టునకు మాఱుగా నది యను తచ్ఛబ్దంబును ముందు నుగాగమంబు నగు ౨౭.**

మైత్రుండు నానిర్దిష్టకార్యంబు చేయునది. వానికి నీవు బాసటయయి యుండునది.

**ఎడుత అద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారంబగు.**
నీకు మేలుగలిగెడుమనియెను-నీకు మేలుగలుగుత మనియెను.

**లూణ్మధ్యమ పురులకు ముడుజ్ఞులగు ౨౯.**

ఆశీస్సు: దీర్ఘాయువగుము-దీర్ఘాయులరగుండు. శాపంబు: రాక్షసుఁడవగుము - రాక్షసులరగుండు. సంప్రార్థనంబు: నన్ను రక్షింపుము-నన్ను రక్షింపుఁడు. విధి:నా చెప్పినపని చేయుము-నా చెప్పినపని చేయుఁడు.

**ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు ౩౦.**
మనము వందుదము.

జేత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు నను సూత్రముచే లజీ పరంబగునపు డత్వంబు. ప్ర. వండఁడు - వండరు; వండదు-వండవు. మ. వండవు-వండరు. ఉ. వండను-వండము.

**మధ్యమముడుజ్ఞులు ముజ్ఞు నాఁబడు ౩౧.**

**వ్యతిరేకంబున ముజ్ఞు పరంబగునపుడు కుజీయగు ౩౨.**
నీవు వండకుము - మీరు వండకుఁడు.

### సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాష నను ప్రయుక్తంబులగు ౩౩.

వండుము-వండుమూ. వండుమి-వండుమీ. వండుఁడు-వండుఁడూ. వండుఁడి-వండుఁడీ. అ-ఆ-ఇ-ఈ-ఎ-ఏ-ఒ-ఓ-అమ్మ-అయ్య ఇత్యాదు లదాదులు.

### ఎదాదు లనుప్రయుక్తంబులగునపుడు ముజ్జునకు వుఱిరుఱి యగు ౩౪.

వినవె-వినవే. వినరె-వినరే. వినకువె-వినకువే. వినకురె-వినకురే.

### టవర్ణకంబు భావంబునందగు ౩౫.

భావంబనఁగాధాత్వర్థంబు. వండుట-పండుట-వినుట-కనుట.

### కఱివర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునందగు ౩౬.

వండక మునుపు-వండుటకు మునుపు. చేయక మునుపు-చేయుటకు మునుపు. మునుపు - ముందు - మున్ను - తొల్లి.

### వ్యతిరేకభావంబున మిఱి యగు ౩౭.

వ్యతిరేక విశిష్టక్రియాభిధాయిధాతువునకు మిఱి యగు. వండమి - పండమి.

### సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకంబగు.

ఏకాశ్రయంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలికంబగుం దద్వాచియగుధాతువున కివర్ణకంబగు. ఇదియె

క్త్వార్థంబు నాఁబడు. వండి-పండి - విని - కని. సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబు లనుటం జేసి చైత్రుని చేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధం బయ్యె.

కజ్ వ్యతిరేకక్త్వార్థంబునందగు ౩౯.

వండక-పండక-కొట్టక-తిట్టక.

తుమర్థభావలక్షణంబులందు నుజ్ యగు ౪౦.

భావలక్షణంబనా నన్యక్రియకు లక్షణభూతంబగు క్రియ. తుమర్థంబందును భావలక్షణంబునందును ధాతువునకు నుజ్ వర్ణకంబగు. తుమర్థంబు—చైత్రుండు వండను బోయెను. పాకక్రియార్థము పోయెనని యర్థము. భావలక్షణము—చైత్రుండు వండ నతిథి వచ్చెను. ఇచట వంట లక్షణము-వచ్చుట లక్ష్యము.

చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణకంబు ద్రుతాంతంబగు ౪౧.

వానలు గురిసినం బంటలువండును. వాఁడు రమ్మనినఁ బోయితిని.

ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతంబగు ౪౨.

జాబిలి తోతెంచుడుం గువలయంబులు వికసిల్లె.

చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు ౪౩.

చూచుచుం బోవుచున్నాఁడు - చూచుచుంబోయెను—చూచుచుం బోవఁగలఁడు.

తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియలగు ౪౪.

ప్రహరించెడివాఁడు - ప్రహరించెడువాఁడు. ప్రహర్తయని యర్థము.

వానికి లోపంబు బహుళంబుగానగు ౪౫.

ప్రహరించువాఁడు - ప్రహర్తయని యర్థము.

ఉన్న కలజి నవర్ణకంబులు
భవద్భావిశతృక్తవదర్థంబులందగు ౪౬.

ఉన్నవర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబునందగు - కలజివర్ణకంబు భవిష్యదర్థక శత్రర్థంబునందగు - నవర్ణకంబు క్తవదర్థంబునందగు. ఇవి సత్వాభిధానంబునం దగునని యెఱుంగునది. సుబంతవాచ్యంబు సత్వంబునాఁబడు. వండుచున్నవాఁడు - వండఁగలవాఁడు - వండినవాఁడు.

వ్యతిరేక తృవర్ణకార్థంబున నిజి యగు ౪౭.

వండనివాఁడు. ఎడిప్రభృతివర్ణకాంతంబు లేడును ధాతుజవిశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు.

లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును
లాఁతికిం గర్తయందు నగు ౪౮.

సకర్మకంబునాఁగ ర్మాకాంక్షోత్థాపకంబు; అకర్మకంబు నాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు.

పడుజ్యనుబంధంబు కర్మంబునందగు ౪౯.

కొట్టఁబడుచున్నాఁడు - కొట్టఁబడుచున్నది - కొట్టఁబడుట-కొట్టఁబడనివాఁడు.

గురువిరహితంబులయి యయాంతంబులయిన యేకస్వరద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాషనగు ౫౦.

ఏకస్వరధాతుద్విస్వరధాతువులమీఁదియించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాషనగు; గురుమంతంబగు ధాతువునకును, యాంతంబగు ధాతువునకును మీఁది యించుగ్వక్రంబుల కియుడాగమంబు రాదు. భుజ్+ఇయ్+ఇంచు - భుజియించు. పక్షంబున-భుజించు. గుణ+ఇయ్+ఇంచు - గుణియించు-గుణించు. ఇంచుగ్వ్యవధానంబునం జేసి సంస్కృత ధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుంగునది. యాచ్ - అర్థ ఇత్యాదులు గురుమంతంబులు. వ్యయ-ఇది యాంతము. యాచించు-అర్థించు-వ్యయించు. జి-ఇంచు అనుచో నిత్యంబగుటం జేసి యయుగాగమంబు రాఁగా యాంతంబగుటం జేసి యియుడాగమంబు లేదని యెఱుంగునది. కృతాకృతప్రసంగి నిత్యంబు నాఁబడు. నగు+ఇయ్+ఇంచు=నగియించు - నగించు; నగు+ఇయ్+ఎను=నగియెను - నగెను. పడు+ఇయ్+ఎను=పడియెను-పడెను ఇత్యాదు లెఱుంగునది.

పడ్వాదుల నలవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాషనగు ౫౧.

పడ్డ-పడిన; పడ్డను-పడినను. పడు-ఇడు-చెడు-తగు-అగు-కను-కొను-తిను-మను-విను-చను—ఇవి పడ్వాదులు.

క్రియాఫలంబు కర్తృగామియగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తంబగు ౫౨.

ఇదియె యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు. వండు కొనుచున్నాఁడు.

కొనుధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగానగు ౫౩.

వండికొనియె - వండుకొనియె. బహుళం బనుటచే యాంతంబునకు నిత్యంబు - చేసికొనియె.

ఇకారవక్రంబు లుక్తంబులందలివి పరంబులగుచో యాకు సకారంబగు ౫౪.

చేయు - చేసిరి - చేసి - చేసికొను - చేసెను - చేసెడిని ఇత్యాదు లెఱుంగునది.

చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాషనగు ౫౫.

అన్చున్నాఁడు - అంచున్నాఁడు - అనుచున్నాఁడు; అన్చును - అంచును-అనుచును. అను - కను - కొను - తిను - మను-విను ఇవి యన్వాదులు.

ఉన్నశబ్దంబు పరంబగునపు డుండుధాతువునకు లోపంబగు ౨౬.

ప్ర. ఉన్నాఁడు – ఉన్నారు; ఉన్నది–ఉన్నవి. మ. ఉన్నావు–ఉన్నారు. ఉ. ఉన్నాను–ఉన్నాము. ఉన్నవాఁడు.

చేదాద్యర్థనాంతంబయిన యుండున కున్నాదేశంబు విభాషనగు ౨౭.

ఉన్నను – ఉండినను.

తిరుటలు పరంబగునపు డన్వాదుల నుస్థానంబున మున్నయు నుండుడులోపంబును విభాషనగు ౨౮.

అందురు–అంట. ఉందురు–ఉంట. పక్షంబున—అనుదురు–అనుట; ఉండుదురు – ఉండుట ఇత్యాది.

ఇట బిందువుమీఁది తదలకు నిత్యవైకల్పికంబులయి టడలగు ౨౯.

అంటివి – అనితివి. అందురు – అందురు. ఉంటివి–ఉండితివి. ఉండురు–ఉందురు.

ముజ్జు పరంబగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు ౩౦.

బహుళంబనుటచే దీనికి నొకానొకచో నతిచారంబని తెలియంగునది.

ముజ్ఞు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును
మువర్ణకంబునకు మాముడియు నగు ౬౧.

కొమ్ము - కొనుము. కొండు - కొనుఁడు.

రువర్ణకంబు పరంబగునపుడు నున్నమీఁది తదడల
యుత్వంబునకు లోపంబు విభాషనగు ౬౨.

పోషిఁత్రు - పోషింతురు. కొంద్రు - కొందురు. కొండ్రు - కొండురు.

సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు ౬౩.

సంస్కృతధాతువుల కంగలాదుల కించుగాగమంబగు. పచించు-వచించు-త్యజించు-భజించు-అంగలించు. అంగల - అడక-అరగ - అవుల - ఉంక - ఉగ్గడ - ఓసర - కార - గాల- జాడ - తిలక - తులక - పంక - పరిక - పలవ - అప్ప-ఒప్ప- ఆల ఇత్యాదు లంగలాదులు.

ఇఉఋల కించుక్కు పరంబగునపు
డయుగవుగరుక్కులగు ౬౪.

జి - జయించు. నీ - నయించు. ద్రు-ద్రవించు. లూ - లవించు. ధృ-ధరించు. తౄ-తరించు.

నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు ౬౫.

నిర్జికి నామధాతువుల కయుగాగమంబు గలుగదు. నిర్జించు-నుతించు-స్తుతించు. ఈ జ్ఞాపకంబుచేతనే నామంబు

లకు ధాతుత్వవివక్షయం దించుగాగమంబగునని యెఱుంగునది. శయనించు-ష్షయనించు.

సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు- పరంబగునపుడు గుణంబగు ౬౬.

అ-ఏ-ఓ — ఈమూఁడునుగుణంబులునాఁబడు. ఋస్థానికం బగు గుణంబు రపరంబయియుండు. సంస్కృతధాతూపధలకు-ఇ-ఉ-ఋ-అనువానికి వరుసగ ఏ-ఓ-అర్ అనునవి యించుక్కు- పరంబగునపు డగునని యెఱుంగునది. ఛిద్ — ఛేదించు. భిద్ - భేదించు. ఘుష్ - ఘోషించు. పుష్ - పోషించు. వృష్-వర్షించు. హృష్-హర్షించు.

స్పృశికి గుణంబు విభాషనగు ౬౭.

స్పర్శించు - స్పృశించు.

లిఖ భుజ రుచ కృశంబులకు గుణంబులేదు ౬౮.

లిఖించు-భుజించు - రుచించు-కృశించు. కుచధాతువునకు గుణంబు లేదని యొకండు వక్కాణించెనది గ్రాహ్యంబుగాదు.

సృజికి నిర్మితిని గుణంబు లేదు ౬౯.

చతుర్ముఖుండు ప్రజలను సృజించె. అతండు విషయంబుల విసర్జించె.

సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు ౭౦.

పచింపించు - వచింపించు - ఆవులింపించు - వండించు - వండించు.

రంజాదుల యించుక్చకారంబునకు సబిందుకంబున
కప్రేరణంబున ద్విరుక్తలకారంబగు ౨౧.

రంజిల్లు - భాసిల్లు-వర్ధిల్లు - విలసిల్లు-రాజిల్లు. ఈయా దేశయోగంబున భిదాదులకర్మకంబులగు. భేదిల్లు-కంపిల్లు-సంధిల్లు.

ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు
లోపంబగు ౨౨.

లాదేశంబున కపవాదంబు—రంజించు - భేదించు - సంధించు.

చుగాగమంబాచ్ఛికంబునకసంయుక్తనలడరాంతంబునకుం
బ్రేరణంబున బహుళంబుగా నగు ౨౩.

పూను-పూనుచు-పూనించు. తేలు-తేలుచు-తేలించు. మగుడు - మగుడుచు - మగిడించు. కుదురు-కుదురుచు - కుదిరించు. విను - వినుచు ; వక్ష్యమాణంబు పుగాగమంబు : వినిపించు. బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు. అను - అనిపించు. తిను - తినిపించు. కను - కనిపించు. దీని యత్వంబునకు దీర్ఘంబు నగు - కానిపించు.

అట్లు పుగాగమంబును మాన్వాదులకగు ౨౪.

మాను-మానుపు-మానుచు. మను-మనుపు-మనుచు. బాహుళకంబున దీని కించుక్కు లేదు.

చుక్కువర్ణంబుకు పరంబు లగునపు డిత్వంబున కుత్వంబగు ౨౫.

అట్లు చుక్కుగాగమంబు లడంగ్వాది మాయ్వాదులకగు నగుచో వాని కడవ్రాలు లోపించు ౨౬.

అడఁగు – అడఁచు – అడఁగించు. మాయు – మాపు – మాయించు. అడఁగు – కరఁగు – కలఁగు – నలఁగు ఇత్యాదు లడంగ్వాదులు. మాయు – ఈడుగు – కడచు – కుడుచు – బిగియు ఇత్యాదులు మాయ్వాదులు. ఆఁగు ప్రభృతు లుభయగణంబులు. బాహుళకంబునం జేసి కొన్నింటికి కించుక్చుక్పుగాగమంబులు మూఁడును, గొన్నింటి కందు యథాసంభవముగా రెండును, గొన్నింటి కొక్కటియు నగునని యెఱుంగునది. ఆఁగు – ఆఁచు – ఆఁపు – ఆఁగించు. రేఁగు – రేఁచు – రేఁపు – రేఁగించు. పాయు – పాచు – పాపు. విఱుగు – విఱుచు. చూచు – చూపు. నేరుచు – నేరుపు. మేయు – మేపు. లేచు – లేపు. కలియు – కలుపు. తడియు – తడుపు. తెలియు – తెలుపు ఇత్యాదు లెఱుంగునది.

ఇంచుక్చుక్పుగాగమంబులు పరంబు లగునపు డాగమాదేశలోపంబులు పెక్కు తెఱఁగులం గానంబడియెడి ౨౭.

అగు – కావించు. వచ్చు – రావించు – రప్పించు. విన్నపము – విన్నవించు. మోఁకాలు – మోఁకరించు. కేక – కేకరించు. పలవ – పలవరించు – పలవించు. ఆల – ఆలకించు – ఆలించు.

ప్రక్క-ప్రక్కలించు. నొచ్చు-నొంచు-నొప్పించు. ఉండు - ఉనుచు-ఉంచు. డిగు - డించు - డిగించు. పెరుగు - పెనుచు- పెంచు. తునుఁగు - త్రుంచు. మునుఁగు-ముంచు - మునుచు. మొగుడు- మొగుడుచు- మొగుచు - మోడుచు - మొగిడించు. చొచ్చు - చొనుపు - చొప్పించు. చినుఁగు - చించు - చింపు. త్రెగు - త్రెంచు - త్రెంపు. తిరుగు - త్రిప్పు. చచ్చు - చంపు. నిలుచు-నిలువరించు-నిలుపు. కొను-కొలుపు. పోవు - పుచ్చు. పనుచు - పంచు. పనుపు - పంపు. అనుచు-అంచు. అనుపు- అంపు. అనుప్రయుక్తంబగు పోవునకుం బుచ్చుమాత్రంబగు. మోసపోవు-మోసపుచ్చు ఇత్యాదు లెఱుంగునది.

అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు
మానునకు విభాషనగు ౭౮.

అనిపించు. అను-కను-తిను-విను. మానిపించు - మానించు.

అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమంబగు
నప్పాదులకు విభాషనగు ౭౯.

అడ్డము-అడ్డగించు. అడ్డము-ఓర-చిత్తము-పంతము- "వెల్ల-బోర-మట్టము-మేళము ఇత్యాదు లడ్డాదులు. అప్ప - అప్పగించు-అప్పించు. అప్ప - ఒప్ప - పల్లము - కోపము ఇవి యప్పాదులు.

ఆడోడుకూడుల డకారంబునకుం జుక్కు పరంబగునపుడు రేఫంబగు ౧౦.

ఆడు - ఆరుచు - ఆడించు. ఓడు - ఓరుచు - ఓడించు. కూడు-కూరుచు-కూడించు.

చెడునకుం జుక్కుగాగమంబులును డా కలఘురేఫంబు నగు ౧౧.

చెఱుచు - చెఱుపు.

పడునకుం జుక్కును డా కలఘురేఫంబు నగు ౧౨.

పఱుచు.

శబ్దపల్లవంబగు పడున కించుక్కు విభాషనగు నగుచో డాకు లఘురేఫంబగు ౧౩.

వెలువడు - వెలువరించు - వెలువఱుచు. చొప్పడు - చొప్పరించు - చొప్పఱుచు.

ప్రేరణంబునం దించుక్కుమీఁద నించుక్కు లేదు ౧౪.

ఇట్లనుటం జేసి ప్రేరణార్థంబయిన యించుగాగమంబు మీఁదం బ్రేరణార్థంబుగాగమంబగునని యెఱుంగునది. నొచ్చు-నొంచు-నొంపించు. చచ్చు-చంపు-చంపించు.

ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు ౧౫.

నిగుడు - నిగిడి - నిగిడె; మగుడు - మగిడి - మగిడె; ఉడుగు - ఉడిగి - ఉడిగె; మునుఁగు - మునిఁగి - మునిఁగె.

ముజ్జీత్తులు ముత్తు నాఁబడు ౫౬.

ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు
చకారంబున కగు ౫౭.

పచించు–పచింపించు. వచించు–వచింపించు. పిలుచు–పిలిపించు. వలచు – వలపించు. పత్వంబు హెచ్చునకుం గలుగదు ; మెచ్చునకు విభాష నగు. హెచ్చించు – మెప్పించు – మెచ్చించు.

ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం
బగునపుడు పవలగు ౫౮.

ఆగమంబు——పచింపఁడు–పచింపుము. అడఁపఁడు–అడఁపుము. అన్యము——పిలువఁడు–పిలువుము.

ఖండబిందువుమీఁది సిద్ధచకారంబునకు ముత్తు
పరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు ౫౯.

తలఁపక–త్రేఁపక–తోఁపక. ఏఁచునకు వైభాషికంబు. ఏఁపక–ఏఁచక. నోఁచునకుం గలుగదు. నోఁచక.

ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి
దుక్కు పరంబగునపుడు పకారంబు విభాషనగు ౬౦.

ఆకర్ణింపుదురు–దంపుదురు–చింపుదురు. పత్వంబు రాని పక్షంబున వక్ష్యమాణతాదేశంబు. ఆకర్ణింతురు – దంతురు–చింతురు.

**అగు వచ్చు చొచ్చు చూచులకు ముత్తు పరంబగునపుడు కా రా చొరు చూడులగు ౧.**

అగు : కాఁడు - కమ్ము. వచ్చు : రాఁడు - రమ్ము. చొచ్చు: చొరఁడు-చొరుము. చూచు: చూడఁడు-చూడుము.

**ఇచ్చునకు సర్వంబున కీయగు ౨.**

ఇచ్చు—ఈఁడు-ఇమ్ము. ఈయ యను నాదేశంబు నొకా నొకచోఁ గానంబడియెడి: బలిమినీయనిభూమివలయపతుల.

**తేతేరులు తెచ్చున కగు ౩.**

తెచ్చు-తేఁడు-తేరఁడు. తెమ్ము-తేరుము.

**చావు నోవులు చచ్చునొచ్చుల కగు ౪.**

చచ్చు—చావఁడు - చావుము. నొచ్చు—నోవఁడు-నోవుము. వక్ష్యమాణంబు ద్విత్వంబు-నొవ్వఁడు.

**జిత్తు పరంబగునపుడు వాని వువర్ణంబు విభాషను లోపించు ౫.**

చాక - చావక. చాకుము-చావకుము. నోక-నోవక. నోకుము-నోవకుము.

**అగున కను కనులకు ముజిత్తులు పరంబులగునపుడు కానా కానలు విభాషనగు ౬.**

అపవాద్యసూత్రముచేఁ గాకు వకారంబు. వక్ష్యమాణం బొత్వంబు. కమ్ము-అగుము-అవుము-ఔము. కండు-అగుఁడు-అవుఁడు-ఔఁడు. నాఁడు-అనఁడు. కానఁడు-కనఁడు.

నేరుచునకు లిఙ్గాట్టులు ముత్తుం బరంబులగునపుడు
రుచులకు లోపంబు బహుళంబుగానగు ౯౭.

నేచెను - నేరిచెను. నేచును - నేరుచును. నేరఁడు - నేరువఁడు.

పోవునకు దుజ్మత్తులు ముజ్ఞుం బరంబులగునపుడు
వులోపంబుం బొదపదలును విభాషనగు ౯౮.

పోదురు - పోవుదురు. పోఁడు - పోవఁడు. పోవుము - పొదము-పదము-పొమ్ము.

అగుపోవుల కడవ్రాల కిద్వ్యక్రంబులు పరంబులగునపుడు
యకారంబగు ౯౯.

వక్ష్యమాణం బైత్వంబు. అయి - ఐ. అయిరి - ఐరి. పోయి-పోయిరి. పోయెను-పోయెడు.

అగునకు వక్రంబు గూడుచో దీర్ఘంబగు ౧౦౦.

వక్ష్యమాణంబు ద్విత్వంబు. ఆయెను - అయ్యెను ; ఆయెడు-అయ్యెడు.

పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు
కడవ్రాయి బహుళంబుగ లోపించు ౧౦౧.

పిలఁడు - పిలువఁడు ; పిలుము - పిలువుము. లేచునకు ముజ్ఞు పరంబగునపుడు చులోపంబగు. లెమ్ము-లెండు. పిలుచు-నిలుచు-తలఁగు ఇత్యాదులు.

లాఁతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి ౧౦౨.

కావుతను-కాతను. అగుట-కావుట. అగుదును-కావుదును. కానను - కావునను. అనుదును - అనవుదును - నావుదును. ఇత్యాదు లెఱుంగునది.

ఆచ్ఛికంబులం దయియవులకు వకారితమంబులు బహుళంబుగానగు ౧౦౩.

అయిదు - ఐదు. అయిరేని - ఐరేని. అవుడు-ఔడు. గవుసెన-గౌసెన.

కలుగున కర్త్రర్థంబునందు లట్టు పరంబగునపుడు కల యగు ౧౦౪.

ప్ర. కలఁడు-కలరు; కలదు-కలవు. మ. కలవు-కలరు. ఉ. కలను-కలము.

త్రర్థంబునం గలాదేశంబు విభాషనగు ౧౦౫.

ఎడిమొదులకు లోపం బిట నిత్యంబు. కలవాఁడు-కలుగువాఁడు.

అర్త్రర్థంబునకు లజి మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు ౧౦౬.

ప్ర. లేఁడు - లేరు - లేదు - లేవు. మ. లేవు - లేరు. ఉ. లేను - లేము. లేమి - లేక - లేని-లేవడి.

వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాషనగు ౧౦౭.

ప్ర. ఒల్లఁడు - ఒల్లరు - ఒల్లదు-ఒల్లవు. మ. ఒల్లవు - ఒల్లరు. ఉ. ఒల్లను-ఒల్లము. ఒల్లమి-ఒల్లక-ఒల్లని. పక్షంబున వలవఁ డిత్యాది. ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులం గానంబడియెడి.

చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు ౧౦౮.

నిలుతురు-పిలుతురు-అడఁతురు-కడతురు - చింతురు-పెంతురు-పచింతురు-వచింతురు. చేతురు - కోతు రిత్యాదులసాధువులని యెఱుంగునది.

పడుజి కొను లొకానొకచో స్వార్థంబునం
దనుప్రయుక్తంబులగు ౧౦౯.

చొచ్చు-చొరఁబడు. నిలుచు - నిలువఁబడు. కూడు-కూడఁబడు. పండు-పండుకొను.

తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తంబగు నగుచో
నుత్వంబుపయిని దానితకారంబు దకారంబగు ౧౧౦.

అగుదెంచు - నెగయుదెంచు - పోవుదెంచు. అగు - నెగయు-పోవు-చొచ్చు-పుచ్చు-తోఁచు - నడచు - పఱచు - మొలచు-పీచు ఇత్యాదులు.

అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యనుప్రయుక్తంబగు
నగుచో గువర్ణంబు విభాషను లోపించు ౧౧౧.

అరుదెంచు-అరుగుదెంచు. ఏతెంచు-ఏగుదెంచు-చనుదెంచు.

**అయ్యది పరంబగునపుడు చువర్ణంబు లోపించు ౧౧౨.**

చొచ్చు-చొత్తెంచు. పుచ్చు-పుత్తెంచు. తోఁచు-తోఁతెంచు.

**అద్దానికి ముత్తు పరంబగునపుడు తే తేరు అగు ౧౧౩.**

అగు దేఁడు - అగు దేరఁడు ; అగు దెమ్ము - అగు దేరుము.

**భూతంబున లజీకి లిదంతంబగు నగుధాతు**
**వను ప్రయుక్తంబగు ౧౧౪.**

వాఁడు రాఁడయ్యెను-వారు రారయిరి. అది రాదయ్యెను-అవి రావయ్యెను. నీవు రావయితివి-మీరు రారయితిరి. నేను రానయితిని-మేము రామయితిమి.

**నుజ్యంతంబగు నగుధాతువు క్రియావిశేషణంబుల**
**కనుప్రయుక్తంబగు నుఙకి విభాషనగు ౧౧౫.**

కాను-అనునది నుజ్యంతంబగు నగుధాతువురూపంబు.

**దానికి హ్రస్వంబు విభాషనగు ౧౧౬.**

లెస్సగాను-లెస్సగను. న్యాయ్యముగాను-న్యాయ్యముగను—ఇట సరళంబు నిత్యంబు. చూడఁగాను-చూడఁగను-చూడను—ఇట స్వత్వంబు లేదు.

**ఉన్నకలనవర్ణకంబులమీఁది తచ్ఛబ్ద వకారంబునకు**
**లోపంబు విభాషనగు ౧౧౭.**

బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు. వండుచున్న వాఁడు-వండుచున్నాఁడు. వండుచున్న వారు-వండుచున్నారు. వండుచున్న వాఁడవు-వండుచున్నాఁడవు. వండుచున్న వారరు-వండుచున్నారరు. వండుచున్న వాఁడను - వండుచున్నాఁడను.

వండుచున్నవారము - వండుచున్నారము. ఇట్లు వండఁగల వాఁడు - వండఁగలాఁడు, వండినవాఁడు - వండినాఁ డిత్యాదు లెఱుంగునది.

ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు ౧౧౮.

కూరుచుండు-నిలుచుండు-పరుండు - పన్నుండు-ఆఁకొను - ఈకొను-ఈయకొను - ఇయ్యకొను-చకొట్టను - త్రెకొట్టను - మేకొను-మయికొను-మేలుకొను-మేలుకను - మేలుకాంచు - అలవడు-ఏరుపడు-చొప్పడు - వెలువడు - తలపోయు - వాసపోయు - ఆపోవు - కొంపోవు - కొనిపోవు - విజయంచేయు - కయివ్రాలు-తూపాడుచు ఇత్యాదులు శబ్దపల్లవంబులు.

చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు ౧౧౯.

ఆఋషీశ్వరుఁడు వచ్చెనా ఫలించుఁ గార్యముల్. వాఁడు తేపు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము.

ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయి వచనంబు ధాతువిశేషణంబుల కగు ౧౨౦.

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రిసహితంబుగం బుష్పకారూఢుం డయి సాకేతంబున కేతెంచె.

అగతికంబులగు భ్వాదుల కిందు యోగంబు లేదు ౧౨౧.

భూ - సృ - కృ - రేకృ - లోకృ - లోచ-పచి-లప ఇత్యాదులకు గతివిరహితంబు లగు ధాతువుల కీభావంబ్రయో

గంబు లేదు. ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి-ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు- ఉద్-అభి-ప్రతి - పరి - ఉప. ఊరీప్రభృతులును సాక్షాత్ప్రభృతులును గతిసంజ్ఞాకంబులు. ప్రాదు లిరువది రెండు నుపసర్గంబులు నాఁబడు. ప్రభవించు-ఆవిర్భవించు - ప్రసరించు - సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతిరేకించు- ఆలోకించు - ఆలోచించు-ప్రపంచించు - ప్రలపించు ఇత్యాదులార్యప్రయోగంబుల నెఱుంగునది.

వలయ్యాదిక్రియలకుం గర్త్రయగు భావంబునందు నుజియగు ౧౨౨.

వలయ్యాదిక్రియలకుం గర్త్రృభూతక్రియావృత్తియగు ధాతువునకు నుజివర్ణకంబగు. వాఁడు చూడవలయు-వారలు చూడఁగావలయు. నీవుచూడవలయు - మీరుచూడవలయు. నేను చూడవలయు - మేము చూడవలయు - మనముచూడవలయు. వలయును-వలదు; కూడును - కూడదు; చెల్లును - చెల్లదు; తగును-తగదు ఇత్యాదులు వలయ్యాదులు.

సకర్మకంబునకు స్వరూపప్రేరణార్థంబులు రెండును గొనుపడ్వనుబంధంబులం దొక్కొక్కటితోడ రెంటితోడం గూడుచో నగు నవియాఱుం గూడ రూపంబు లెనిమిదయ్యె; వాని సొరిది నుదాహరించెద.

కర్త్రర్థకము.

మైత్రుఁడు - వంటకమును - వండెను.

ఆత్మనేపదకర్త్రర్థకము.

మైత్రుఁడు - వంటకమును - వండుకొనియెను.

కర్మార్థకము.

మైత్రునిచేత — వంటకము — వండఁబడియెను.

ఆత్మనేపదకర్మార్థకము.

మైత్రునిచేత — వంటకము — వండుకొనఁబడియెను.

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుఁడు — మైత్రునిచేత — వంటకమును — వండించెను.

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము.

చైత్రుఁడు — మైత్రునిచేత — వంటకమును — వండించుకొనియెను.

ప్రేరణకర్మార్థకము.

చైత్రునిచేత — మైత్రునిచేత — వంటకము — వండింపఁబడియెను.

ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

చైత్రునిచేత — మైత్రునిచేత — వంటకము — వండించుకొనఁబడియెను.

గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబులకు ప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మంబగు ౧౨౩.

పొందు మొదలయినవి గత్యర్థకంబులు. తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు. తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు. విను — చెప్పు — చదువు మొదలయినవి శబ్దకర్మంబులు. అకర్మకంబులు ప్రసిద్ధంబులు. మైత్రుండు గ్రామంబుం బొందెను — చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను. లాఁతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి. మైత్రుండు పుడమి నేలెను — చైత్రుండు మైత్రునిం బుడమి నేలించెను.

**అనభిహితకర్తృకొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు ౧౨౪.**

రాముఁడు మిథిలం గనియె—రామునకు మిథిల గనంబడియె—రామునిచే మిథిల గనంబడియెను. మైత్రుండు తత్త్వంబుం దెలిసెను—చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను. కన్యాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగా నగు. విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను. కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను.

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్మానుబంధంబులు లేమిం జేసి రూపభేదంబు లయిదని యెఱుంగునది.

కర్తరర్థకము.

మైత్రుండు — మనియెను.

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుండు — మైత్రుని — మనిచెను.

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము.

చైత్రుండు — మైత్రుని — మనుచుకొనియె.

ప్రేరణకర్మార్థకము.

చైత్రునిచేత — మైత్రుండు — మనుపఁబడియె.

ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

చైత్రునిచేత — మైత్రుండు — మనుచుకొనఁబడియె.

వెండియుం బ్రేరణంబునం దించుగాగమంబుగలిగినచో సకర్మకంబునకుం బండ్రెండు సకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది.

ఇది క్రియాపరిచ్ఛేదము.

# కృదంతపరిచ్ఛేదము



## కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు ౧.

ధాతువునకు విహితంబగు దుజ్భిన్న ప్రత్యయంబు కృత్తునాఁబడు. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృ కర్మాద్యర్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునది. ఆఁక - బంధనము, మొలక - నవోద్భిదము. ఏలిక-పాలకుఁడు. కోరిక-వాంఛయు, వాంఛితంబును. మూఁక-సంఘము. ఆడిక-నింద. ఓడిక-స్రోతస్సు.

## ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపంబగు ౨.

కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువునంతంబులగు కగచయవలకు లోపంబగు. మీఁదిలక్ష్యంబులం జూడంబడు.

## కవర్ణకం బలుగ్వాదుల కగు ౩. (క)

అలుగు-అలుక. ఆఁగు-ఆఁక. ఎఱుఁగు-ఎఱుక. ఇట బిందులోపంబు. ఇట్లు కొన్నింట గ్రహించునది. కడఁగు-కడఁక. కలఁగు-కలఁక. కాఁగు-కాఁక. తునుఁగు-తునుక. నడచు - నడక. నలఁగు-నలఁక. పోవు-పోక. మడఁగు-మడక. మలఁగు -

మలఁక. మునుఁగు-మునుక. మూఁగు-మూఁక. మొలచు-మొలక. వచ్చునకు—రా-రాక. వంగు-వంక. వీఁగు-వీఁక. ఇఁక కపులు పరంబులగులపుడు కనునకు దీర్ఘంబగు. కానుక. కినియు ముదియుల కుత్వంబు నగు. కినియు-కనుక. ముదియు-ముదుక. ఇత్యాదు లలుగ్వాదులు.

ఇమివర్ణకంబు కలుగ్వాదుల కగు ౪. (ఇమి)

కలుగు-కలిమి. ఓరుచు - ఓరిమి. కూరుచు-కూరిమి. నేరుచు-నేరిమి. ప్రేలుచు-ప్రేలిమి. బడియు-బడిమి. బ్రదుకు-బ్రదిమి. ఒడ్డు-ఒడ్డిమి. తాలు-తాలిమి.

తజ్వర్ణకంబు చేయ్వాదుల కగు ౫. (ఁత)

చేయు - చేఁత, అలయు - అలఁత. కూయు - కూఁత. కోయు - కోఁత. గీయు - గీఁత. నేయు - నేఁత. పూయు - పూఁత. పోయు-పోఁత. మూయు-మూఁత. మేయు-మేఁత. మ్రోయు-మ్రోఁత. రోయు-రోఁత. లాయు-లాఁత. వ్రాయు-వ్రాఁత. వ్రేయు-వ్రేఁత.

కువవర్ణకం బడంగ్వాదుల కగు ౬. (కువ)

అడఁగు-అడఁకువ. ఎఱుఁగు-ఎఱుకువ. కలఁగు-కలఁకువ. నలఁగు-నలఁకువ. పెనఁగు - పెనఁకువ. పొలయు - పొలఁకువ. మఱచు-మఱకువ. మెలఁగు - మెలఁకువ. లోఁగు - లోఁకువ. వేగు - వేకువ.

టవర్ణం బాడ్యాదుల కగు నగుచో నంతలోపంబగు ౭. (ట)

ఆడు–ఆట. ఊరు–ఊట. ఊఱడు–ఊఱట. ఏఁకరు – ఏఁకట. ఓడు – ఓట. తివురు – తివుట. తేరు–తేట. త్రిమ్మరు–త్రిమ్మట. పండు–పంట. పాడు–పాట. మండు–మంట. వండు–వంట. వేసఱు–వేసట. అనుప్రయుక్తంబయిన యాటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబసమం బగు. కోలాటము–పోరాటము–మండ్రాటము ఇత్యాదులు.

టువర్ణకంబు పడ్వాదుల కగు నగుచో నవి యాద్యక్షరశేషంబులయి దీర్ఘంబు నొందు ౮. (టు)

పడు – పాటు. చెడు – చేటు. అడుచు–ఆటు. కఱచు–కాటు. పొడుచు – పోటు. వయిచు – వాటు. ఏయు – ఏటు. ఓడు–ఓటు. ప్రేయు – ప్రేటు.

పవర్ణకంబు తిరియ్యాదుల కగు ౯. (ప)

తిరియు–తిరిపము. కలియున కత్వంబు నగు–కలపము. పొలయు–పొలపము. మురియు – మురిపము. సొలయు–సొలపము. వలియు – వలిపము.

తవర్ణకం బావులించు లోనగువాని కగు ౧౦. (త)

ఆవులించు–ఆవులింత. ఇగిలించు–ఇగిలింత. ఓకిలించు–ఓకిలింత. కుళ్లగించు–కుళ్లగింత. కుసిలించు–కుసిలింత. కొక్కరించు–కొక్కరింత. కొప్పరించు – కొప్పరింత. గిలిగించు – గిలిగింత. ఇత్యాదు లెఱుంగునది.

## పువర్ణకంబు మాయ్యాదుల కగు ౧౧. (పు)

మాఁయు – మాఁపు. మేఁయు – మేఁపు. అడుచు – అడుపు. ఇంచు – ఇంపు. ఏఁచు – ఏఁపు. ఏచు – ఏపు. కను – కానుపు. కాచు–కాపు. చూచు – చూపు. తలఁచు–తలఁపు. తోఁచు–తోఁపు. త్రేఁచు–త్రేఁపు. త్రోచు – త్రోపు. పూఁచు – పూఁపు. పెనుచు – పెనుపు. పొలుచు – పొలుపు. ప్రోచు–ప్రోపు. మెచ్చు–మెప్పు. మోచు–మోపు. వలచు – వలపు. వాచు–వాపు. ఇత్యాదులు మాయ్యాదులు.

## ఇకవర్ణకం బంజ్యాదుల కగు ౧౨. (ఇక)

అంజు – అంజిక. అమరు – అమరిక. అరయు – అరయిక. అలయు – అలయిక. ఆడు – ఆడిక. ఓడు – ఓడిక. ఓపు – ఓపిక. కను – కానిక. కూడు – కూడిక. కోరు – కోరిక. పొందు–పొందిక. పోలు–పోలిక. తూను తూఁగున కగు – తూనిక. ఇత్యాదు లంజ్యాదులు.

## అప్పాదులకు నజీ యగు ౧౩. (న)

అప్ప – అప్పన. ఉజ్జ – ఉజ్జన. ఒప్ప–ఒప్పన. గట్ట – గట్టన. గడ–గడన. దట్ట–దట్టన. దీవ–దీవన. పాట – పాటన. మన్న – మన్నన. వీచు – వీవన.

## బడి యేల్వాదుల కగు ౧౪. (బడి)

ఏలుబడి – కట్టుబడి – కనుబడి–కొనుబడి – గిట్టుబడి– చెల్లుబడి – చేరుబడి – తగులుబడి – తీఱుబడి – పెట్టుబడి – పోబడి – మ్రొక్కుబడి – వచ్చుబడి–సాగుబడి.

గడ చేర్వాదుల కగు ౧౫. (గడ)

చేరుగడ - తిరుగడ - తీఱుగడ - తేఱుగడ-తేగడ-మనుగడ - విడుగడ - వీడుగడ.

ఇకి కోర్వాదుల కగు ౧౬. (ఇకి)

కోరికి - పూనికి - పోలికి - మనికి - వినికి - చూడు చూచునకగు : చూడికి.

వువర్ణకంబు మన్వాదుల కగు ౧౭. (వు)

మను-మనువు. కాచు - కావు. కొలుచు - కొలువు. చచ్చు-చావు. తడయు-తడవు. నిలుచు - నిలువు. నొచ్చు - నోవు. పూచు - పూవు. ప్రచ్చు - ప్రవ్వు.

అవర్ణకంబు గీఱ్వాదుల కగు ౧౮. (అ)

గీఱు - ఊఁద - ఎండ - కాయ - చదియ - తునియ-పరియ - పాయ - పిడుచ - మీట-ముడియ-వదర-వ్రయ్య.

అకవర్ణకంబు మాఱ్వాదుల కగు ౧౯. (అక)

మాఱు-మాఱకము. అమ్ము-అమ్మకము. అంపు-అంపకము. పంచు - పంపు - పంపకము. వండుడకారంబు టకారంబగు : వంటకము. తోము - తోమకము. అద్దు-అద్దకము.

డువర్ణకం బాఱ్వాదుల కగు నగునపుడు పకారంబు చయలకగు ౨౦. (డు)

ఆఱు-ఆఱుడు. అమ్ము - అమ్ముడు. అల్లు - అల్లుడు - ఎక్కు - ఎక్కుడు. క్రమ్ము - క్రమ్ముడు. చోపు - చోపుడు.

త్రొక్కు - త్రొక్కుడు. త్రోచు - త్రోపుడు. దంచు - దంపుడు. దాఁచు-దాఁపుడు. దిగు-దిగుడు. దోఁచు-దోఁపుడు. పెంచు-పెంపుడు-ప్రేఁపుడు. ప్రాఁకు - ప్రాఁకుడు. మాయు - మాపుడు. రాచు-రాపుడు ఇత్యాదులు.

ఉవర్ణకం బడుక్వాదుల కగు ౨౧. (ఉ)

అడుకు - అంటు - ఒప్పు - ఒఱుగు - ఒసఁగు.

వడిప్రభృతు లిట్లెఱుంగునది ౨౨. (వడి)

వడి : కొలువడి - గెలువడి - నడవడి. వ్యతిరేకంబున లేవడి. వి : తనివి - తెలివి - కీవి. అవు : తగవు - నగవు - ఉఱవు. ఇ : చేయి - వ్రాయి. కలి : కనుకలి - వినుకలి. ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది.

ఇది కృదంతపరిచ్ఛేదము



# ప్రకీర్ణకపరిచ్ఛేదము

పదాద్యంబులు ఋఌ వర్ణంబులు రలతుల్యంబులు ౧.

అతఁడు ఋషి-ఇట సంధిలేదు. ఆ ఋషి-ఇట యడాగమములేదు. వచ్చె ఋషి-వచ్చెన్ ఋషి-వచ్చెను ఋషి—ఇట ద్రుతమునకు లోప సంశ్లేషస్వత్వములు.

ఆచ్ఛికపదంబులం దుత్తమంబు లగు రులుడుల
ముందఱియేత్వంబునకు హ్రస్వంబు విభాషనగు ౨.

నల్లేరు-నల్లెరు. పల్లేరు-పల్లెరు. పెన్నేరు-పెన్నెరు. మానేరు - మానెరు. ఆడేలు - ఆడెలు. కుందేలు - కుందెలు. తోఁడేలు-తోఁడెలు. నాఁగేలు-నాఁగెలు. నేరేడు-నేరెడు. మారేడు - మారెడు. పూరేడు - పూరెడు. తంగేడు - తంగెడు.

ఊయేలపయ్యెదతాయెతులంద్రిక్క-నామంబులందు
యాకుం బాలవ్యవక్రయోగంబులేదు ౩.

స్పష్టము.

ఊయేల యూయాలల బాఁపుల నొండొంటికిం
గుఱుచయొండె నగు ౪.

ఉయేల - ఊయెల - ఊయేల - ఉయాల - ఊయల - ఊయాల. వక్ష్యమాణంబు యద్విత్వంబు-ఉయ్యేల-ఉయ్యెల-ఉయ్యాల-ఉయ్యల.

పయ్యెద పయ్యద ౫.

ఊయేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనంబొండె నగు ౬.

ఊయేల - ఉయ్యెల. ఊయల - ఉయ్యల. ఊయాల- ఉయ్యాల. ఆయె-వలిదము-ఓయి - ఓయారము-కోపు (ధను ర్గ్రము) - జాజర -తీనియ-తీయము - తేప(ప్లవము) - తేమ - తోయలి - దీవియ - నూవు - నోవి - నోవు - పూవు - పేయి - మోక (అంకురము) - మోటిక - మోవు - వీయము ఇత్యాదు లూయేలాదులు.

అకారంబు క్రిందిఅకారంబునకుం దుదినులుల క్రిందినలలకు లోపంబు బహుళంబుగ నగు ౭.

అఱ్ఱు-అఱు. గొఱ్ఱియ-గొఱియ. కన్ను-కను. నన్ను- నను. పల్లు-పలు. విల్లు-విలు.

అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు ౮.

అక్కట - అకట. అక్కట - అట్టిక - అట్టుక - అట్టె - అయ్యో-అయ్యారె -అవ్వారి - ఇట్టిక - ఉప్పవడము - ఉమ్మి - ఎక్కసక్కియము-ఎక్కసెక్కియము-ఎక్కిరింత-ఎడ్డ-ఎన్నిక- ఎమ్మిక - కజ్జాయము - కట్టా-కట్టిక - కప్పురము - కమ్మటము - కమ్మతము - కవ్వాడము - కొట్టిక - కొమ్మ - కొయ్యగూర - గయ్యాళము - గిజ్జిగాఁడు - గుజ్జరాతి - చిట్టి-చిన్న - చిమ్మట - చెన్నఁటి - చెప్పము - చెప్పఁడు - చెమ్మట - చెల్లియలు-

జవ్వాజి – జాబిల్లి – తమ్మటము – తమ్ములము – తల్లి – తుమ్మికి – తువ్వర – తెల్ల – దవ్వు – దివ్వియ – నవ్వు – నిద్దుర–నివ్వరి–నివ్వాళి – నువ్వు – నెట్టికి – నెమ్మలి – పవ్వళించు – పిన్న – పుల్లియ – పువ్వు – పెద్ద–పొట్టి – ప్రాకెన్న – ప్రెగ్గడ – బెగ్గడు – బొమ్మ – బొమ్మికము – బొమ్మిడికము – బొమ్మిడీకము – మజ్జ – మత్తాబు – మల్లారము – ముక్కు – ముద్దియ–మొట్టికి–మొక్కరము – మొగ్గరము – మొల్లాము – రడ్డి – లొట్టిపిట్ట – వట్టి – వయ్యాళి–సన్నియ – సవ్వడి – సివ్వంగి – అట్లు – ఇట్లు – ఎట్లు – అప్పుడు–ఇప్పుడు–ఎప్పుడు – అన్ని – ఇన్ని – ఎన్ని – కొన్ని – మమ్ము – మిమ్ము – తమ్ము – అమ్మ – అక్క – అవ్వ – అయ్య – అప్ప–అచ్చోటు–ఇచ్చోటు–ఎచ్చోటు – అచ్చటు – ఇచ్చటు – ఎచ్చటు ఇత్యాదు లక్కటాదులు.

జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు ౯.

అత్తఱత్తె – కన్నదరె – నన్నడిగె – పల్లొత్తె – విల్లందె.

హాదులయు సీలుగులోనగువాని తొలిహల్లునకు లోపంబు బహుళంబుగ నగు ౧౦.

హడపము–అడపము. హరిదళము–అరిదళము. హలఁది–అలఁది. సీలుగు–ఈలుగు. సీలుగు–నెగయు–పొందు–పొనరు. పూను–పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు.

## ఆరాటాదులం బ్రథమేతరదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు ౧౧.

ఆరాటము—అరటము. ఆరాటము—కక్కూఱితి – కేళా కూళి – కొమారుఁడు – కొమారిత – గంబూరము – సెండారము—బంగారము— బేహారము—పీటతాటము—సంతోసము.

## ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు ౧౨.

ఓయారము—ఒయారము. ఓయారము – కేళాకూళి – కోలె – గూడారము – గోరువంక పక్షి – జోహారు—నీలుగు – పేఁడ – బేహారము. దీర్ఘమధ్యంబు. మూఱు – మూలుగు – మోఱకు—పీటతాటము – పీడియము ఇత్యాదులు.

## అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు ౧౩.

అడఁగు – అణఁగు. అడఁగు – కడఁగు – చిల్లాడము—తడగము – నాఁడెము – పోఁడి – మిడుఁగు – వడఁకు – మిడుఁగురు ఇత్యాదు లడంగ్వాదులు.

## దక్కులోనగువాని దాకు డకారంబు విభాషనగు ౧౪.

దక్కు—డక్కు. దక్కు – దగ్గఱు – దాఁగు – దాకలి – దిగు – దిగ్గియ – దూయు – దెందము – దెప్పరము – దెప్పు— దొంగ – దొప్ప ఇత్యాదులు.

ఏతాదులకు ఋవర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు ౧౫.

ఏతము - ఏతాము. ఏతము - కళ్లము - గాలము - గుడ్డము - గోణము - గోతము - జాజము - జుంజము-జోతము- తణగము - బొండ్లము - మండము - లాతము - వీణము ఇత్యాదులు.

పదాంతంబులయి యసంయుక్తంబు లయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు ౧౬.

ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు. మ్రాన్పడె. మినువడె-మిన్వడె. వత్తురు వారు-వత్తుర్వారు. కారుకొనియె-కార్కొనియె. రాములు-రాముల్. వనములు - వనముల్.

అచ్చికంబులం బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు ౧౭.

కినుక - కిన్క. కానుక - కాన్క. చిలుక - చిల్క. కాలువ - కాల్వ. అడుగు - అడ్గు. కడుపు - కడ్పు. పెరుగు - పెర్గు. కూరుకు - కూర్కు.

లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి ౧౮.

కలికి-కల్కి. ములికి-ముల్కి. బుడిపి-బుడ్పి. పొలఁతి-పొల్తి.

అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాషనగు ౧౯.

అబ్బురము–అబ్రము. అబ్బురము–కప్పురము–అప్పుడు–ఇప్పుడు–ఎప్పుడు–చప్పుడు–నెత్తురు–ఇత్యాదులు.

చుక్పరకరువర్ణంబునకు ముందటి దువర్ణంబునుత్వంబునకు
లోపంబు విభాషనగు నగుచోఁ దత్పూర్వంబు
గురువు గాదు ౨౦.

అదురుచు–అద్రుచు. ఎదురుచు–ఎద్రుచు. పదురుచు–పద్రుచు.

జూదాదుల దాకు జకారంబు విభాష నగు. ౨౧.

జూదము–జూజము. అవుదు–జవాది–జాది–జాదు–విరవాది.

నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు
హ్రస్వదీర్ఘంబులకు గిగీ లగు ౨౨.

కుంభకర్ణుఁడు–గింభకర్ణుఁడు. రావణుఁడు–గీవణుఁడు.

పాదంబునం బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసంబులు
నాఁబడు ౨౩.

యవలలు లఘ్వలఘువులు మైత్రింబొరయు
రేఫంబులు పొరయవు ౨౪.

రేఫంబులు లఘ్వలఘువులుం దక్కంగల విశేషంబులు
నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు ౨౫.

శ్లో. శ్రీస్తనాంచితకస్తూరీపంకసంకలితోరసే,
పంకజాక్షాయ నాథాయ వేంకటేశాయ మంగళమ్.

ఇది ప్రకీర్ణకపరిచ్ఛేదము

---

క. మును మదుపజ్ఞం బగుచుం
దనరిన వ్యాకృతిని సూత్రతతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగు భంగిఁ దగన్.

క. తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందినవారల్
తనరఁగ నీవ్యాకరణం
బున మూలంబయినకృతిని బోలఁ గనఁదగున్.

బాల వ్యాకరణము

సంపూర్ణము.



# పరిభాషా ప్రకాశిక

**అధికరణము** :—ఆధారము.

**అవధారణ** :—నిశ్చయము; ఒక వస్తువును మఱియొక వస్తువుగా నిశ్చయించుట.

**అనుకరణము** :—ఒకఁడు చెప్పిన దానిని మఱియొకఁడు అట్లే పలుకుట.

**అనుస్వారము** :—స్వరమును (అచ్చును) అనుసరించి వచ్చునది. ఏదో యొక అచ్చు సాహచర్యము లేనిదే దీనికి స్వతంత్రోచ్చారణగాని, ఉనికిగాని లేదు. కనుక నే ఆ పేరు.

**అలఘువులు** :—బరువుగాఁ బలుకఁబడునవి.

**అవ్యయములు** :—లింగ, విభక్తి, వచన శూన్యములగు పదములు.

**ఆగమము** :—ఒక అక్షరము ప్రక్కను ఇంకొక అక్షరము మిత్రుని వలె వచ్చి చేరుట.

**ఆత్మనేపదము** :—క్రియాఫలము సరాసరిని కర్తకే చెందునప్పుడు అట్టి క్రియ ఆత్మనేపద మనఁబడును.

**ఆదేశము** :—ఒక అక్షరము శత్రువువలె వచ్చి ఇంకొక అక్షరమును తరిమివేసి దాని స్థానమును ఆక్రమించుట.

**ఆమ్రేడితము** :—ఒక శబ్దము రెండుమాఱు లుచ్చరింపఁబడినప్పుడు రెండవమాఱు ఉచ్చరింపఁబడిన శబ్దము ఆమ్రేడిత మనఁబడును.

ఉపధ :—ఒక పదములో కడపటి అక్షరమునకు ముందక్షరము. ఉపాంత్యము అనియు దీనిని చెప్పవచ్చును.

ఏకాదేశము :—సంధిలో పూర్వ, పర స్వరములకు బదులుగా ఒకే అచ్చు వచ్చుట.

కారకము :—క్రియతో అన్వయము గలది.

కృత్తులు :—ధాతువులకు చేరు వేఱు ప్రత్యయములు కృత్తులు. వానితో చేరిన పదములు కృదంతములు (క్రియానామములు) అనఁబడును.

తద్ధర్మము :—స్వభావము.

తద్ధితములు :—విభక్త్యంత శబ్దములమీఁద భావార్థ, స్వార్థ, మతు బర్థాదులయందు ప్రయోగింపఁబడు ప్రత్యయములు.

తపరకరణము :—అత్తు, ఇత్తు మొదలైన వానిలోని తకారమునకు తపరకరణమని పేరు. ఇదిగల చోట్ల ఈ తకారమునకు ముందున్న అక్షరము హ్రస్వమైనచో హ్రస్వముగానే, దీర్ఘమైనచో దీర్ఘముగానే గ్రహింపవలెను. తపరకరణము లేనియెడల హ్రస్వ దీర్ఘములు రెంటిని గ్రహింపవలసి యుండును.

ద్విత్వము :—సమానమైన (ఒకేవిధమైన) హల్లుల కూడిక.

ధాతువు :—క్రియయొక్క మొదటి రూపము. ప్రత్యయాదులు చేరని దశలోని నిర్వికల్పమైన క్రియారూపము.

నిత్యము :—చెప్పిన కార్యము చెప్పినట్లు తప్పక వచ్చుట.

పరస్మైపదము :—క్రియాఫలము కర్తకుఁగాక పరునికిఁ జెందుచో ఆ క్రియ పరస్మైపద మనఁబడును.

ప్రాతిపదికము :—ధాతుభిన్నమును, ప్రత్యయభిన్నమును, ప్రత్యయాంత భిన్నమును నై అర్థవంతమైన శబ్దము ప్రాతిపదిక మనఁబడును. దీనినే (మూల) నామము, ప్రకృతి అని కూడ పిలుతురు. దీనిపై ప్రత్యయాదులు చేరి పరినిష్ఠితమైన రూపమేర్పడును.

బహుళము :—చెప్పిన కార్యము నిత్యము, నిషేధము, వైకల్పికము, అన్యవిధము అను నాలుగు విధములుగాను జరుగుట. అనఁగా, చెప్పిన కార్యము ఖండితముగా జరుగుట; అసలు జరుగక పోవుట; జరిగియు, జరగకయు పోవుట; చెప్పిన కార్యముకాక మఱియొక విధముగా జరుగుట ఏదైనను కావచ్చు నన్నమాట.

లఘువులు :—తేలికగా పలుకఁబడు అక్షరములు.

లోపము :—వర్ణము మఱుగుపడిపోవుట, లేదా కనఁబడక పోవుట.

వర్ణకము :—ప్రత్యయము.

విగ్రహము :—వృత్త్యర్థమును విడఁదీసి తెలుపు వాక్యమునకు విగ్రహ మని పేరు.

విభాష :—చెప్పిన కార్యమునకు నిషేధ వైకల్పికములను తెలుపుటకు విభాషయని పేరు.

విశేషణము :—విశేష్యముయొక్క విశేషములను (ధర్మాదులను) తెలుపునది విశేషణ మనఁబడును.

విశేష్యము :—ఇంద్రియ గోచరములగు చేతనా చేతనముల పేరులు విశేష్యము లనఁబడును.

వృత్తి :—వృత్తి యనఁగా ప్రత్యయమూలముననఁగాని, ఇతర పదము యొక్క అర్థము మూలముననఁగాని ఏది విశిష్టార్థమును బోధించునో అది. దీనినే పరార్థాభిధాన మందురు.

వైకల్పికము :—చెప్పిన కార్యము జరుగను వచ్చు; జరుగకను పోవచ్చునని తెలుపునది.

వ్యంజనములు :—హల్లులు.

వ్యతిహారము :—చేసినదానికి సమముగా అట్లే చేయుట.

శబ్దపల్లవము :—ధాతువులు లోనగువానికి ధాతువులు చేరి ప్రత్యేకార్థమును దెలుపునవి శబ్దపల్లవము అనఁబడును.

సంధి :—పూర్వ, పర స్వరములకు పరస్వరము ఏకాదేశముగా వచ్చుట.

సంభావన :—సంజ్ఞ.

సంశ్లేషము :—మీఁది హల్లుతో కూడిక. అసమానమైన (వేర్వేఱు) హల్లుల కూడిక. అట్లు కూడిన అక్షరములు సంయుక్తాక్షరములు.

సమాసము :—సమాసమనఁగా కొన్ని సమర్థములగు పదములు ఒకపదముగాఁ గలియుట.

స్వరములు :—అచ్చులు.

# వ్యాకరణ పరిభాషలకు
# ఆంగ్ల పర్యాయ పదములు

అకర్మకము - Intransitive
అచ్చులు - Vowels
అనుకరణము - Onomatopoeia
అనునాసికము - Nasal
అనుస్వారము - A nasal character
అమహత్తులు - Inanimates, Minors
అలఘువులు - Hard semi-vowels
అవధారణము - Emphasis
ఆకాంక్ష - Government
ఆఖ్యాతము - Predicate
ఆగమము - Augment, Addition
ఆత్మనేపదము - Reflexive verb
ఆదేశము - Substitute
ఆమ్రేడితము - Reduplication
ఆశీరర్థకము - Precative, Benedictive
ఓష్ఠ్యములు - Labials
ఉపధ - Penultimate
ఉపసర్గము - Prefix
ఊష్మములు - Sibilants
ఏకవచనము - Singular number

కంఠ్యములు - Gutturals
ఔపవిభక్తికము - Declinable
కర్మ - Object
కర్మార్థకము (కర్మణిప్రయోగము) - Passive voice
కర్త్రర్థకము (కర్తరిప్రయోగము) - Active voice
కారకము - Regimen, case which expresses the relation of the noun to the verb
కాలము - Tense
,, , వర్తమాన - Present tense
,, , భూత - Past tense
,, , భవిష్యత్ - Future tense
కృదంతము - Verbal noun, Participle
క్త్వార్థము - Gerund
క్రియ - Verb
క్రియావిశేషణము - Adverb
గురువు - A long vowel taken alone or a short vowel before two consonants

put together, Accented syllable
తద్ధర్మము - Aorist
తద్ధితము - Nominal derivative
తరప్రత్యయము - Comparative
తమః ప్రత్యయము - Superlative
తాలవ్యములు - Palatals
తుమున్నంతము - Infinitive
దంత్యములు - Dentals
దీర్ఘము - Long vowel
దేశ్యము - Country dialect
ద్విత్వము - Double consonant
ధాతువు - Root
నిత్యము - Fixed
నిపాతము - Particle
పరస్మైపదము - Active or subjective verb
పరుషములు - Hard consonants, Surds
పురుషము - Person
,, , ఉత్తమ, First person
,, , మధ్యమ, Second person
,, , ప్రథమ, Third person
ప్రత్యయము - Affix, Termination
ప్రాతిపదికము - Crude noun
ప్రేరణార్థకము - Causal
బహువచనము - Plural number
భాష - Language
,, , గ్రామ్య - Brogue
భాష , గ్రాంథిక - Classical language
,, , వ్యావహారిక - Spoken or Colloquial language
మహత్తులు - Animates, Majors.
మూర్ధన్యములు - Cerebrals
యౌగికము - Derivative
లఘువులు - Light semivowels
లింగము - Gender
,, , పుం - Masculine gender
,, , స్త్రీ - Feminine gender
,, , నపుం - Neuter gender
లోపము - Omission
వచనము - Number
,, , ఏక - Singular number
,, , బహు - Plural number
వర్ణములు - Alphabets
విగ్రహము - Sentence showing meaning of compounds, Analysis
విభక్తి - Case
,, , ప్రథమా - Nominative case
,, , ద్వితీయా - Accusative case
,, , తృతీయా - Instrumental case
,, , చతుర్థీ - Dative case
,, , పంచమీ - Ablative case

విభక్తి, షష్ఠి - Possessive or genitive case

,, , సప్తమీ - Locative case

,, , సంబోధన - Vocative case

విభాష - Optional

విశేషణము - Adjective

విశేష్యము - Substantive, noun

విసర్గ - Aspirate

వీప్స - Repitition, Pervation

సంధి - Euphony, Combination

సంయుక్తాక్షరము - Compound letter

సంశ్లేషము - Coalition

సకర్మకము - Transitive

సమాసము - Compound

సమాసము, తత్పురుష - Determinable compound

,, , బహువ్రీహి - Relative compound

సమాసము, ద్విగు - Numeral compound

,, , కర్మధారయ - Appositional compound or descriptive compound

,, , ద్వంద్వ - Copulative compound

,, , అవ్యయీభావ - Adverbial compound

సన్నంతము - Desiderative

సరళములు - Soft consonants, Sonants

సర్వనామము - Pronoun

సిద్ధము - Indigenous

స్థిరములు - Fixed consonants

స్పర్శములు - Mutes

స్వత్వము - Statusquo

హల్లులు - Consonants

హ్రస్వము - Short vowel



# సూత్రానుక్రమణిక

—ంంశ్రీంం—

---

The Liberty Press, Madras.

# రంగనాథ రామాయణము

## (ద్విపదకావ్యము)

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి విపుల పీఠికతో

కావ్య సౌందర్యముతోపాటు పఠన మాత్రమున పారమార్థికమునుగూడ ప్రసాదించునదై, అఖండాభిమానాదరములను చూరగొని, అనేక విశేష కథలతోగూడిన ఆరు కాండల అద్భుత కావ్యము. దీనిని అనేక వ్రాతప్రతుల సాయమున శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ, టి. వి. రంగాచార్యులుగార్లచే సవరింపించి, దీనిని గురించిన యావద్విషయములను, కథావిశేషములను వివరించు శర్మగారి విపుల పీఠికతో తెల్లని గ్లేజు కాగితమున ముత్యములవంటి అక్షరములతో ముచ్చటగా ముద్రించియున్నాము. పూర్తి క్యాలికో బైండు. పైన రామాయణ చిత్రములుగల జాకెట్ కవరు. అనేక చిత్ర పటములతో. రూ. 6

# దేవీ భాగవతము

శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ విరచితము

ప్రత్యేకము దేవీ మాహాత్మ్య ప్రతిపాదకముగా వ్యాస భట్టారకుడు వ్రాసిన శ్రీభాగవతమునకు ఇది సరళ, సుందర అనువాదము. దేవీ మహిమను వివరించు రీతిగా రామాయణ, భారత, భాగవత కథ అనేకము ఇందులో పొందు పరుపబడియున్నవి. అవి, ఇతర గ్రంథములలో వలె గాక, పరదేవీ ప్రమేయముతోనే నడచినవిగా ఇందులో వర్ణింపబడియున్నవి. తెలుగు పద్యములు కూడ సర్వ జనోపయోగముగా సరళ శైలిలో, చక్కని ధారగా నడచి చాల కమ్మగా ఉన్నవి. శ్రీచక్ర చిత్రము, ఇతర చిత్రములతో. రూ. 8

# విజయాశ్వ చరిత్రము

శ్రీ పురాణం పిచ్చయ్యగారిచే రచితము

అతి సుందరమైన కథా కలాపములతో, ప్రాచీనులకును, నవీనులకును గూడ నచ్చునట్లు, ప్రాచీన ప్రబంధ ధోరణిలో, చక్కని కల్పనలతో, మను చరిత్రాదులను తలపించునట్లు రచించిన మనోహర శృంగార పద్యకావ్యము. రూ. 2-50

# చిన్నయసూరి

చిన్నయసూరిగారు క్రీ. శ. 1806 లో జన్మించిరి. చెంగల్పట్టు జిల్లా శ్రీపెరుంబుదూరు వీరి జన్మస్థానము. వీరు శ్రీ చాత్తాద (సాతాని) వైష్ణవకులమునకు జెందినవారు. వీరి తండ్రి పరవస్తు వెంకటరంగ రామానుజాచార్యులు (వ్యవహార నామము వెంకటరంగయ్య); తల్లి శ్రీమతి శ్రీనివాసాంబ. మహాపండితులైన వెంకటరంగయ్యగారు అక్కడి పాఠశాలలో ఆచార్యకము నిర్వహించుచుండిరి.

చిన్నయ్య చిరకాలము చదువు సంధ్యలు లేక, కేవలము 'పండిత పుత్రుఁ'డై అల్లరి చిల్లరిగా తిరుగుచుండెను. పది పదునేనేండ్ల ప్రాయమునఁ గాఁబోలు, నలుగురిమాటలు పడలేక ఓనమాలతోఁ జదువు మొదలు పెట్టెను. పట్టుదల పట్టి త్వరలోనే పాండిత్యము గడించెను. తర్కాలంకార మీమాంసాశాస్త్రములను క్షుణ్ణముగా నభ్యసించెను. వేదములు, వేదార్థములు లెస్సగా నేర్చెను. హయగ్రీవ మంత్రమును ఉపాసించి దాని మహిమచే సర్వతోముఖ పాండిత్యము సంపాదించి, సరస్వతీమూర్తియై రాణించెను.

కొన్నాళ్లకు ఆ కుటుంబము మద్రాసుకు మారెను. వెంకటరంగయ్యగారు దొరల ప్రాపకమున శుద్ధాంధ్రాధ్యాపకపదవిని సంపాదించిరి. క్రొత్తగా వచ్చిన దొరలకును, చాలమంది పాదిరీలకును తెలుఁగు సంస్కృతములు నేర్పి వారిని తీర్చి దిద్దిరి. వారి యనంతరము చిన్నయ్య ఆ స్థానము వహించెను. పచ్చయప్ప కళాశాలలోను, రాజధానికళాశాలలోను చిరకాలము ఆంధ్రాధ్యాపకుఁడుగానుండి యఖండ భాషాసేవ గావించెను. వీరి పాండిత్యమునకు మెచ్చుకొని మద్రాసు విశ్వవిద్యాలయ కార్యదర్శిగానుండిన ఆర్బత్‌నాట్ దొర ఈయనకు 'సూరి' బిరుదమును ప్రసాదించి, ఆదేపనిగా సీమనుండి చెక్కించి తెప్పించిన బంగారు కడియము తొడిగించి గౌరవించెను.

సకలశాస్త్ర నిష్ణాతుఁడు, సాహిత్య చక్రవర్తి యయ్యు శమదమాది గుణవిరాజితుఁడై, నిగర్వ చూడామణియై, పండితుఁడుగా, కవిగా, ఉద్యోగిగా ఖ్యాతికెక్కిన చిన్నయసూరి కేవలము వ్యాకరణకర్తగానే కాక, తెలుఁగులో గద్యకవితకు శ్రీకారముఁజుట్టి ఘంటాపథముఁ గల్పించిన గద్యబ్రహ్మగాఁగూడ ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో సాటిలేని స్థానము సంపాదించుకొనెను.